

# ఈశావాస్య మిదం సర్వమ్

ఈశుడు ఈ సృష్టిలో అంతటా వ్యాపించి ఉన్నాడు

(యజుర్వేద 40వ అధ్యాయమునకు వైజ్ఞానిక వ్యాఖ్య)

అనుబంధం : ఈశోపనిషత్ ఆంగ్లార్థంతో

మంత్రకర్త :

సర్వవ్యాపక సర్వేశ్వరుడు


**సంకలనం :**

## సుమ్నార్థి

**(డా॥ కోడూరి సుబ్బారావు)**



**ముద్రణ - వితరణ**

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు ప్రచురణ**

సీతాఫలమండి, సికిందరాబాదు – 61

గాయత్రీ గ్రంథమాల : **57**

# ఈశావాస్య మిదం సర్వమ్

ప్రథమ ముద్రణ : ప్రతులు **1000**

ద్వితీయ ముద్రణ : ప్రతులు **1000**



సృష్టి సంవత్సరం : **196,08,53,124 (మన్వంతర సంధి రహితము)**

**(మన్వంతర సంధి సహితము)**

విక్రమాబ్దము : **2080**

దయానందాబ్దము : **200**

శ్రీ శోభకృత్ నామ సంవత్సరము కార్తీకమాసము

**మూల్యము : --/-** మాత్రము (పోస్టు ఖర్చులు అదనం)

**ప్రతులకు :**

1. **గాయత్రీ ఆశ్రమ ట్రస్టు,** ఆర్య సమాజము,
12-10-586/6, మేడిబావి, సీతాఫలమండి,
సికిందరాబాదు - 500 061.
కార్యదర్శి, **కె.పి. నర్సింగరావు,**
సెల్: 98480 11073
గ్రంథకర్త: సుమ్నార్థి: 99089 94084.

2. **ఆర్య సమాజ్,** సీతాఫలమండి మెయిన్‌రోడ్డు,
ఫ్లైఓవర్ దగ్గర,
సికింద్రాబాద్ - 500 061.

# ఈ చిన్న పుస్తకంలో...



**శ్రద్ధగా చదవండి – మనన చింతనలు చేయండి.**

**సాధన చేసి ఆత్మ–పరమాత్మల సాక్షాత్కారాన్ని పొందండి.**

**అనిర్వచనీయమైన ఆనందాన్ని అనుభవించండి.**

ఓ3మ్ స్వస్తి

# పుస్తక నేపథ్యం

**శ్లో॥ వేదమేవ అభ్యసేన్నిత్యం యథాకాల మతన్ద్రితః ।**
**తం హ్యస్యాహుః పరం ధర్మం, ఉపధర్మోఽన్య ఉచ్యతే ॥**

– విశుద్ధ మనుస్మృతి 4–38

"ఆర్యులంతా – విద్యా సదాచారాలు కలిగిన వారంతా సోమరితనాన్ని విడిచి వీలైనంత ఎక్కువ సమయం ఈశ్వరీయ జ్ఞానమైన వేదాన్ని స్వాధ్యాయం చెయ్యాలి. ఆ విషయాలను మనన చింతనలు చెయ్యాలి. ఆ జ్ఞానానికనుగుణంగా జీవితాన్ని గడపాలి. ఇదియే వారికి పరమ ధర్మము. మిగిలినవన్నియు ఉపధర్మము" లని ఋషులంటారు.

మా సీతాఫలమండి ఆర్యసమాజ కార్యవర్గం వేదసిద్ధాంతాలను నెలకొక కరపత్రంగా ప్రచురించి వితరణ చెయ్యాలని సంకల్పించింది. దాని పర్యవసానంగా నన్ను కొన్ని కరపత్రాలు వ్రాసి ఇవ్వవలసిందిగా కోరటం జరిగింది. కొన్ని పండుగలను గురించి వ్రాసి ఇచ్చిన తదుపరి ఆర్యసమాజ ప్రథమ ధర్మం వేదప్రచారం కనుక వేదమంత్రాల మాధ్యమంగానే వైదిక సిద్ధాంతాలను తెలపటం మంచిదని భావించాను. ముందుగా యజుర్వేద 40వ అధ్యాయానికి – ఈశావాస్య సూక్తానికి వ్యాఖ్య వ్రాయాలని సంకల్పించి దానిని పూర్తి చేశాను. అవన్నీ కరపత్రాలుగా ప్రజలలోనికి వెళ్ళినవి. వాటిని చదివిన వారందరూ సంతృప్తి చెందారు. ప్రోత్సహించారు. విడివిడి కరపత్రాలు చెదరిపోవచ్చును కనుక వాటిని ఒక పుస్తకంగా ప్రచురించమని కొందరు కోరారు. అందుచే వాటిని ఈ పుస్తకంగా ప్రచురిస్తున్నాను.

కరపత్రాలు 4 పేజీలు కలవి కావటంవల్ల విషయాన్ని వీలైనంత సంక్షిప్తంగా వ్రాయటం జరిగింది. నేడు అందరికీ సమయాభావం. ఉరుకులు పరుగుల జీవితాలు. అన్ని విషయాలు సంక్షిప్తంగా – మధురంగా (Short and Sweet గా) ఉండాలంటున్నారు కదా! నేటి ప్రజల బౌద్ధిక సామర్థ్యం పెరగటంవల్ల ఆ మాత్రం వివరణ సరిపోతుందనుకుంటున్నాను. ఇంతేగాక, నా ఆరోగ్యం పెద్ద పుస్తకాలు వ్రాయటానికి అనుకూలంగా లేదు. అందుచే ఈ ముద్రణ ఇట్లే ప్రచురిస్తున్నాను.

పాఠకుల స్పందన చూసి మలి ముద్రణలో మార్పులు, చేర్పులు చేసే ప్రయత్నం చేస్తాను.

ఈ ముద్రణలో అనుబంధంగా ఈశోపనిషత్ ఆంగ్లానువాదంతో ప్రచురిస్తున్నాము. నేటి ఆంగ్ల మాధ్యమంలో చదువుకున్న యువతకు స్పష్టంగా అర్థం కావటం కొరకు ఈ ప్రయత్నం చేశాము. ఇది “జనజ్ఞాన్” సంస్థ ప్రచురించిన Vedic Prayer అనే గ్రంథం నుండి సంగ్రహింపబడినది. వారికి మా ధన్యవాదాలు.



# ఈశావాస్య మిదం సర్వమ్

## మన వేదాలే - సృష్టికర్త ఇచ్చిన జ్ఞానం

మానవ మనుగడను పరీక్షించి చూస్తే అతనికి కలిగిన ప్రాథమిక జ్ఞానమంతా నైమిత్తికమే. అంటే – ఇతరులు నేర్పగా వచ్చినది, తాను ఇతరుల ననుకరించుటవల్ల కలిగినది. మిగిలిన ప్రాణి జాతులన్నిటిలో జ్ఞానమంతా జన్మతోనే వస్తుంది. ఉదాహరణకు ఆవుదూడ పుట్టిన కొన్ని నిమిషాలలోనే లేచి నిలబడుతుంది. నడుస్తుంది. ఆవుదూడ పాలకొరకు తల్లివద్ద ప్రయత్నిస్తుంది. తన ఆహారాన్ని గుర్తుపట్టి తినగలుగుతుంది. నెమరు వెయ్యగలుగుతుంది. ఇవన్నీ ఎవరూ నేర్పనక్కరలేదు. సృష్టికర్త జన్మతోనే వాటికా జ్ఞానం యిచ్చాడు. ఇట్టిదానినే స్వాభావిక జ్ఞానం అంటారు. కాని, మానవున కవన్నీ తల్లిదండ్రులుగాని పెద్దలుగాని నేర్పాలి. కావున మానవుని జ్ఞానం నైమిత్తికమన్నారు. ఈ విషయాన్ని మన ఋషులు ఒక సూత్రరూపంలో చెప్పారు. "మాతృమాన్, పితృమాన్, ఆచార్యవాన్ పురుషో వేద" (శతపథ బ్రాహ్మణం 14-6-10-2లో) అన్నారు. అంటే ప్రాథమిక జ్ఞానం ముందుగా తల్లివల్లా, తండ్రివల్లా, అనంతరం ఆచార్యులవల్లా (ఉపాధ్యాయులవల్లా) కలుగుతుందని అర్థం. ఈ ముగ్గురు విద్యావంతులు, సదాచారపరులు అయితే ఆ పిల్లలు మంచి సంస్కారవంతులౌతారు. సభ్యత కలిగిన వారౌతారు. ఆ తరువాతనే మానవుడు స్వయంగా చదువుకొని, ఆలోచించి, పరిశోధించి, సాధన చేసి తాననుకొన్న ఉన్నతస్థితికి చేరుకోగలుగుతాడు.

ఈ విషయంపై కొందరు ఔత్సాహికులు పరిశోధనలు జరిపారు. అందుకు కొంతమంది శిశువులను పుట్టిన వెంటనే తల్లిదండ్రుల నుండి, బంధువులనుండి దూరంచేసి వారిని ఏకాంత నిశ్శబ్ద వాతావరణంలో పోషించి పెద్దచేశారు. వారి ఎదుట ఒక్క మాటగానీ సైగగానీ చెయ్యవద్దనీ, తినటం, త్రాగటం, నడవటం, స్నానం చెయ్యటం, బట్టలు కట్టుకోవం మొ॥నవి ఏమీ చేయవద్దనీ నర్సులకు (దాయిలకు) గట్టి సూచనలిచ్చారు. దానితో ఆ పిల్లలు శారీరకంగా పెరిగి

పెద్దవారయ్యారే కాని మానసికంగా ఏమీ ఎదుగలేదు. తమ పనులు తాము చేసుకోవటం, కావలసినవి అడగటం కూడా చెయ్యలేకపోయారు. ఒక్కమాట కూడా రాలేదు. అప్పుడా శాస్త్రవేత్తలు నిమిత్తం (కారణం) లేకుండా – నేర్పేవారు లేకుండా మానవులకు ప్రాథమిక జ్ఞానం కలుగదని ప్రత్యక్షంగా గ్రహించారు. ఈ విషయం మరోరకంగా కూడా ఋజువయ్యింది. అప్పుడప్పుడు చాలా అరుదుగా అడవులలో తోడేళ్ళు పెంచిన మానవ పిల్లలు దొరుకుతారు. అట్టి పిల్లల నడక, తినటం, త్రాగటం వంటివన్నీ తోడేళ్ళవలెనే ఉన్నాయట. వాటి మాదిరిగానే అరుపులు, కేకలు పెట్టారట. వారికి ఇవన్నీ నేర్పి జనస్రవంతిలోకి తీసుకురావటం చాలా కష్టమయ్యిందట. కనుక మానవునకు కలుగుచున్న ప్రాథమిక జ్ఞానానికి తల్లిదండ్రులు, ఆచార్యులు (గురువులు) కారణమన్న ఋషులమాట పూర్తిగా సత్యం.

ఇప్పుడు మనందరికీ తల్లిదండ్రులు, గురువులు జ్ఞాన శ్రోతస్సులుగా ఉన్నారు. మరి, ఆది మానవుల కెవరుంటారు? అనేది ఆలోచించవలసిన ప్రశ్న. ఆది మానవులకు మనవలె తల్లిదండ్రులుండరు. ఆదిమానవులందరూ యువావస్థ వచ్చేవరకు భూమి గర్భంలో అండములలో పెరిగి పెద్దవారయ్యారు. కోడిగ్రుడ్డును పొదగగా లోపలిద్రవం పిల్లగా మారి పై చిప్పను పగులకొట్టుకొని బయటకు వచ్చునట్లుగా ఆదిమానవులు పెక్కురు స్త్రీ పురుషులు యువావస్థలో భూగర్భంలోని అండముల నుండి బయటకు వచ్చారంటాయి మన వేదశాస్త్రాలు. నేడు బహుళ ప్రచారంలో ఉన్న వికాసవాదం సత్యంకాదు. అది తర్కానికి విజ్ఞానానికి నిలబడదు. డార్విన్ మహాశయుడు జీవించి ఉన్నపుడే ఎంతోమంది వారి వాదనను వ్యతిరేకించారు. ఇప్పుడునూ అనేకమంది శాస్త్రవేత్తలు అంగీకరించటంలేదు. అది ఒక ఆలోచన మాత్రమే. సిద్ధాంతం కాదు. వారికి మరొక మార్గం కనబడక ఆనాటి శాస్త్రవేత్తలు, నాస్తికులు వికాసవాదాన్ని అంగీకరించారు. వారు అంగీకరించి సరిపెట్టుకుంటే సరిపెట్టుకోవచ్చు కానీ విద్యార్థుల బుద్ధులలో ఈ విషయాన్ని చొప్పించటం ఎంతమాత్రం మంచిది కాదు. వారికి ఆలోచించుకోవటానికి అవకాశమివ్వటమే మంచిది. ఈ విషయం వివరంగా తెలుసుకోగోరేవారు మహర్షి దయానంద సరస్వతి గారి రచన **"సత్యార్థ ప్రకాశం"** చదువగోరుచున్నాను.

వికాసవాదం వికసిస్తూనే ఉండాలి కాని మానవ సృష్టితో వికాసం ఆగిపోవటమెందుకు? సృష్ట్యాది నుండి ఇప్పటివరకు అమీబా అమీబాగానే ఉంది

కదా! ఒక ప్రాణి నుండి మరొక ప్రాణిగా పరిణమించటం లేదా కొన్ని అవయవాలు క్రొత్తగా తయారుకావటం అనేది జరుగదు. అంతకన్న పరమేశ్వరుడు ముందుగా ఏకకణ జీవిని, అనంతరం క్రమంగా 2, 3, 4 కణముల జీవులను వేరువేరుగా సృజించటం జరిగిందని చెప్పవచ్చును. ఆయా ప్రాణులు బ్రతకటానికి అవసరమైన మార్పులు ప్రకృతిలో జరిగినపుడు ఆయా ప్రాణులను దేవుడు మానవజాతిని ఉత్పన్నం చేసినట్లే భూగర్భంలో ఉత్పన్నం చేశాడని చెప్పవచ్చు. ఇక జ్ఞానవికాసం ఎలా జరిగిందనే విషయంలో కూడా అనేక ప్రశ్నలు. ఏ జంతువులను చూచి మానవుడు బట్టలు కట్టుకోవడం, ఇల్లు కట్టుకోవడం నేర్చుకున్నాడు? వంటలు చేసుకొని తినటం, స్నాన శౌచాలను పాటించటం, కౌటుంబిక జీవితాన్ని గడపటం మానవులు ఏ ఏ జంతువుల నుండి నేర్చుకున్నాడు? మొ॥ అనేక ప్రశ్నలకు వికాసవాదులు, నాస్తికులు సమాధానం చెప్పవలసి ఉంది. అందుచేతనే, ఆస్తికులు – సృష్టికర్త ఒకడున్నాడనీ ఆయనే ఆదిమానవులకు జ్ఞానాన్ని యిచ్చాడనీ నమ్ముతారు. తర్కంతో నిరూపిస్తారు. ఆ సృష్టికర్తకే 'దేవుడు' అని పేరు పెట్టారు. అతని విశేష గుణాలను దివ్యశక్తులను తెలిపే విశేషణాలతో – పేర్లతో స్తుతిస్తారు, ప్రార్థిస్తారు. అతని అనుగ్రహం కొరకు, తమ ఉన్నతి కొరకు అతను ఉపదేశించిన నియమాలను అనుసరిస్తారు. అయితే సృష్టికర్త పేరేమిటి? ఎక్కడుంటాడు? ఏమేమి చేస్తాడు? అతను ఏ రకంగా మానవులను జ్ఞానవంతులను చేశాడు? మొదలైన విషయాలలో ప్రపంచ మతాలలో భిన్న భిన్న అభిప్రాయాలున్నాయి.

మన హిందూమతంలో – పౌరాణిక సంప్రదాయాలు చాలానే ఏర్పడ్డాయి. ఒక ప్రక్క వేదమే ఈశ్వరీయ జ్ఞానం అంటూనే – వేదానికి భిన్నంగా – ఏకేశ్వరోపాసనకు భిన్నంగా అనేక దేవీ దేవతల కల్పన చేశారు. సంప్రదాయానికి ఒక పురాణం వ్రాసి అవన్నీ వేదవ్యాసులవారు వ్రాసినవేనని ప్రచారం చేశారు. ఒక్కొక్క పురాణం ఒక్కొక్క దేవుని సృష్టికర్త అంటాయి. మిగిలిన దేవతలన్నీ అతని సహాయకులు మాత్రమే నంటాయి. అనేక రకాల పూజా విధానాలు, వ్రతాలు, తపస్సులు, సాధనలు, ఉపాసనలు కల్పించారు. అంతేకాక, ఇవన్నీ వేదాల సారమేనని ప్రచారం చేశారు. వారికి అనుకూలంగా వేదాలకు భాష్యాలు వ్రాశారు. ఋషులు వ్రాసిన గ్రంథాలైన బ్రాహ్మణ ఆరణ్యక దర్శన ఉపనిషదాదులనన్నిటిని కూడా వేదాలే నన్నారు. చివరికి భారతాన్ని పంచమ వేదమన్నారు.

కాని, ప్రథమ మానవ సృష్టి సమయంలో యోగ్యులైన అగ్ని, వాయు, ఆదిత్య, అంగిరస నామక ఋషుల హృదయాలలో ప్రకటింపబడిన ఋక్, యజు, సామ, అథర్వణ వేద సంహితలే ఈశ్వరుని ద్వారా మానవులకు లభించిన జ్ఞానం. అది పరిపూర్ణమైన జ్ఞానం. అందులోని విషయాలన్నీ సర్వ మానవులకు, సర్వ కాలాలకు, సర్వ దేశాలవారికి జ్ఞానాన్ని యిస్తూనే ఉంటాయి. వేదాలు మానవులనందరిని ఒక్క జాతిగా చేసి మానవత్వాన్ని – మానవ ధర్మాలను ఉపదేశిస్తాయి. ఇంతేగాక, అందులో మానవుల కవసరమైన సమస్త విద్యలు – సంగీత, సాహిత్య, నృత్య, శిల్ప కళాకౌశలాలూ, వైద్య, ఖగోళ, యంత్ర, విమానాది విద్యలు; సామాజిక, కౌటింబిక, రాజనైతిక విజ్ఞానాలు అందులో ఉన్నాయి. ఆధ్యాత్మిక సంబంధమైన – ఆత్మ పరమాత్మల ప్రకృతి వికృతుల జ్ఞానం, స్తుతి ప్రార్థనోపాసనల జ్ఞానం, బంధమోక్షాల జ్ఞానం అన్నీ ఉన్నాయి.

మొత్తం 20,416 మంత్రాలలో సమస్త విద్యా విజ్ఞానాలు సూత్రాల రూపంలో చెప్పబడ్డాయి. ఋషులు వాటిని మననం చేసి విశ్లేషించి సమాధిస్థులై తెలుసుకొని సామాన్య మానవులకు ఆ విషయాలను వివరించి చెప్పారు. అనంతరం వాటిని గ్రంథస్థం చేశారు. అట్టివాటిని "స్మృతులు" అంటారు. పరమేశ్వరుని నుండి వచ్చిన జ్ఞానాన్ని మాత్రమే "శ్రుతులు" అంటారు. వీటినే వేదాలు అనాలి. మిగతావన్నీ ఋషులు వ్రాసినవి. అంటే పరిపక్వత చెందిన మానవులు వ్రాసినవి. అవి స్మృతులు మాత్రమే.

పరమేశ్వరీయ వేదాల రక్షణకు కొన్ని కుటుంబాలు అంకితమయ్యాయి. సంహితాపాఠ, పదపాఠ, జటాపాఠ, ఘణాపాఠాది రకరకాల పాఠాలతో వాటిని కంఠస్థం చేశారు. కొందరు శిష్యులను చేర్చుకొని వారికి ఆ పాఠాలను నేర్పారు. అందుచే ఆనాటినుండి ఈనాటి వరకు గురుశిష్య పరంపరగా వేదాలు యథాతథంగా రక్షింపబడ్డాయి. అందులో ఒక అక్షరం చేర్చటంకాని, తొలగించటంకాని జరుగలేదు. ఇంతేగాక, వేదమంత్రాలకు ఛందస్సు, స్వరములు ఉంటాయి. ఆ మంత్రాల అర్థం ముందుగా ఎవరు సాక్షాత్కారం చేసుకొని సామాన్యులకు వివరించారో ఆ ఋషుల పేర్లతోను, అవి ఏ విషయాన్ని చెబుతున్నాయో దానిని 'దేవత' అనే పేర్లతోను కంఠస్థం చేసి రక్షించారు. దేశవ్యాప్తంగా యిట్టి వేదపాఠాలుండటంవల్ల పుస్తకాలలో ప్రక్షిప్తాలు చేర్చినట్లు వేదాలలో మార్పులు

చేర్పులు చేయలేకపోయారు. ఈశ్వరీయ జ్ఞానాన్ని రక్షించటానికి ఇన్ని ఏర్పాట్లు చెయ్యటం మంచిదే అయ్యింది. కనుకనే 197 కోట్ల సంవత్సరాల నాటి వేదాలను మనం యథాతథంగా వినగలుగుతున్నాం. లిపిబద్ధం చేసుకొని పుస్తకాలుగా చూడగలుగుతున్నాం.

మేధావులు, తార్కికులు ఏది ఈశ్వరీయ జ్ఞానవెూ, ఏది కాదో తెలుసుకోవడానికి కొన్ని పరీక్షా నియమాలు పెట్టారు. వాటిలో కొన్ని ముఖ్యమైనవి ఇచ్చట తెలుపుచున్నాము.

**1) సృష్టికర్త నుండి వచ్చే జ్ఞానం ప్రథమ మానవ సృష్టి సమయంలోనే ప్రకాశింపబడాలి. లేకుంటే అతడు పక్షపాతి ఔతాడు. కొంతకాలం తరువాత ఇస్తే ముందు జన్మించిన వారికి అన్యాయం చేసిన వాడౌతాడు.**

**ఈ పరీక్షణతో మనం వివేచిస్తే వేదాలే ఈశ్వరీయ జ్ఞానం. ఏలనంటే క్రైస్తవ మతం 2023 సంవత్సరాల పూర్వం లేదు. బైబిలు ప్రాత నిబంధన కూడా 3 లేదా 4 వేల సంవత్సరాలకు పూర్వం లేదు. ఇక మహమ్మదీయ మతం క్రైస్తవమతం తరువాత వచ్చినదే. 1400 సంవత్సరాల కన్న ఎక్కువ చరిత్ర లేదు. బౌద్ధ, జైన, సిక్కు మతాలన్నీ ఆ తరువాత ప్రారంభింపబడినవే. ఇక ప్రపంచ చరిత్రలను పరిశీలిస్తే- ఇబరానీ - 6,024 సం., మిస్రీ - 27,666 సం., ఫినీశియా - 30,082 సం., పారసీ - 18,990 సం., కాల్డియా - 2,15,00,082 సం., (కాని యిది వారి పృథివి ఉత్పత్తికాలం), ఖితాయి - 8,88,40,413 సం., చీనీ చరిత్ర - 9,60,02,512 సంవత్సరాలు మాత్రమే. మరి, మన భారతీయ చరిత్ర - ఆది మానవ సృష్టి నుండి - వేదాల ఆవిర్భాం నుండి లెక్క కట్టగా ఇప్పుడు సప్తమ మన్వంతరంలో 28వ కలియుగం జరుగుచున్నది. దీనిని అంకెలలోనికి మారిస్తే 197 కోట్ల 29 లక్షల 49 వేల 114 పూర్తయి 124 జరుగుచున్నది. కనుక వేదాలే సృష్టికర్త నుండి వచ్చిన జ్ఞానం.**

**2) ఈశ్వరీయ జ్ఞానం ఒకానొక దేశానికి సంబంధించిన భాషలో కాక**

**జ్ఞానపూర్ (బదోహి)**
**14-1-2000 క్రీ.శ.**
**(మకర సంక్రాంతి 2056 వి.శ.)**

**భాషలన్నిటికి మూలమైన సంస్కృత భాషలో ఉండాలి. లేకున్న దేవుడు ఆ దేశం వారికే మేలు చేసినవాడౌతాడు. మిగిలినవారికి పక్షపాతి ఔతాడు.**

**3)** **సృష్టికర్త నుండి వచ్చిన జ్ఞానం సృష్టి నియమాలకు విరుద్ధంగా ఉండకూడదు. విజ్ఞాన సమ్మతంగా ఉండాలి. లేకుంటే అవి ఈశ్వరీయములు కావు.**

**4)** **సృష్టికర్త సర్వజ్ఞుడు కనుక మానవుల కవసరమైన సమస్త విద్యలు ఉపదేశించాలి. ప్రపంచ మానవులందరికి సర్వకాలాలలోను ఉపయోగపడేవిగా ఉండాలి. కాని, ఇతర ధర్మగ్రంథాలలో సర్వవిద్యలు లేవు. పూర్వం మేము వ్రాసినట్లుగా సమస్త సత్యవిద్యలు బీజరూపంలో మన వేదాలలోనే ఉన్నాయి.**

**5)** **ఈశ్వరీయ జ్ఞానంలో మానవుడు ఉన్నతిని పొందటానికి కావలసిన ఆత్మ పరమాత్మల జ్ఞానం, ప్రార్థన, ఉపాసనలవల్ల కలిగే అసలైన ప్రయోజనం, సమస్త దుఃఖాలనుండి తరించగల సాధనాలు ఉండాలి. మానవతను పెంచేదిగా ఉండాలి. పరస్పర ద్వేష కలహాలను సృష్టించేదిగా ఉండకూడదు. సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని, శాంతిని పెంచేదిగా ఉండాలి. ఈ యోగ్యతలన్నీ మన వేదాలలోనే ఉన్నాయి.**

సృష్టికర్తయే చెబుతున్నాడు – **"ఓ మానవులారా!**

**"సా ప్రథమా సంస్కృతీ విశ్వవారా"** (యజుర్వేదం 7-14)

ఈ వేద సంస్కృతియే భూమండలంపై ఏర్పడిన ప్రథమ సంస్కృతి. ఇదే విశ్వమానవులందరికీ వరణీయమైనది – స్వీకరించతగినది.

**"దేవస్య పశ్య కావ్యం న మమార న జీర్యతి"**

"వేదము, వేద సంస్కృతి ఎప్పటికీ నశించవు. జీర్ణించిపోవు – ముసలివి కావు. సదా నిత్య నూతనంగానే ఉంటాయి. ప్రళయకాలంలో కూడా అవి నాలో అప్రకటితంగా ఉంటాయి. మరల సృష్టి జరిగినపుడు ఋషుల హృదయాలలో వేదాలను ప్రకటిస్తాను" అని పరమేశ్వరుడు ఉపదేశిస్తున్నాడు.

**"సూర్యా చంద్ర మసౌ ధాతా యథా పూర్వ మకల్పయత్ ।**
**దివం చ పృథివీం చాంతరిక్ష మథో స్వః ॥**

– ఋగ్వేదం 10-190-3

ఈ సూర్యచంద్రులు, ద్యులోక పృథివీ లోకాలు, వీటి మధ్య ఉండే గ్రహ ఉపగ్రహాదులు, సమస్త ప్రాకృతిక శక్తులు, సర్వవిధ ప్రాణులు, వేదము పూర్వ కల్పంలో ఉన్నట్లే ఇప్పుడును నాచే సృజింపబడ్డాయి. కాలాంతరంలో ఈ సృష్టి ప్రళయమౌతుంది. అప్రకటితమౌతుంది. మరల సృష్టి జరిగినపుడు ఇవన్నీ ఈ విధంగానే సృజిస్తాను. సృష్టి, ప్రళయాలు దినరాత్రుల వంటివి. ఒకదాని వెంట మరొకటి వస్తూనే ఉంటాయి.

**"........ యథా తథ్యతోర్థాన్ వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః" –**

– యజుర్వేదం 40–8

నేను ఈ సృష్టిని శాశ్వతులైన మీకొరకే సృజించాను. ఏ పదార్థాన్ని ఎట్లు సృజించవలెనో అట్లు సృజించాను. వాటి గుణగణాలను (పదార్థ విజ్ఞానాన్ని), వాటినెట్లు ఉపయోగించుకోవాలో అట్టి జ్ఞానాన్ని కూడా వేదము ద్వారా మీకు ఉపదేశించాను. వేద స్వాధ్యాయం చెయ్యండి. వేద ఫలాలనందుకోండి.

**"కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతం సమాః"**

– యజుర్వేదం 40–2

వేదవిహిత కర్మలు చేస్తూనే నూరేండ్లు జీవించగోరండి. ఇహపర సుఖాలను, నిశ్శ్రేయసాన్ని – గొప్ప ఆనందాన్ని (ముక్తిని) పొందండి.

ఈవిధంగా వేదం మానవుల సమగ్ర ఉన్నతికి బాటలు వేస్తుంది. క్రమంగా వేద సందేశాలను ముందు పేజీలలో తెలుసుకుందాము. చివరిగా వేద స్వాధ్యాయం వల్ల కలిగే ఫలాలను (లాభాలను) తెలిపే ఒక వేద మంత్రాన్ని చెప్పుకుందాం.

**స్తుతా మయా వరదా వేదమాతా**
**ప్రచోదయంతాం పావమానీ ద్విజానామ్ ।**
**ఆయుః ప్రాణం ప్రజాం పశుం కీర్తిం**
**ద్రవిణం బ్రహ్మవర్చసమ్ ।**
**మహ్యం దత్వా వ్రజత బ్రహ్మలోకమ్ ॥**

– అథర్వవేదం 19–71–1

నాచే కీర్తింపబడిన – స్వాధ్యాయం చేయబడిన, వరాలనిచ్చు వేదమాత ద్విజులను – విద్యాగర్భం నుండి రెండవసారి జన్మించిన విద్యావంతులను పవిత్ర

పరుస్తుంది. దీర్ఘమైన ఆయువును, బలమైన ప్రాణశక్తిని, సుసంతానాన్ని, గోఅశ్వాది పశుసంపదలను, కీర్తిని, ధనమును, బ్రహ్మజ్ఞాన ప్రకాశాన్ని యిస్తుంది. అనంతరం జీవాత్మనైన నన్ను బ్రహ్మలోకానికి - ముక్తిధామానికి చేరుస్తుంది.

పై లాభాలన్నీ వేద స్వాధ్యాయం వల్ల కలుగుతాయి. వాటిని పొందుటకు గల మార్గాలను వేదం సూచిస్తుంది. ఈ పుస్తకంలో మనం యజుర్వేద 40వ అధ్యాయం ఏమి ఉపదేశిస్తున్నదో తెలుసుకుందాము.

## సృష్టికర్త సందేశం - 1

# త్యక్తేన భుంజీథాః - త్యాగభావంతో అనుభవించు

**ఓం ఈశావాస్య మిదం సర్వమ్ యత్ కించ జగత్యాం జగత్ ।**
**తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్య స్విద్ధనమ్ ॥**
- యజుర్వేదం 40-1

**ఓ మానవులారా!**

**ఈశావాస్య మిదం సర్వం** = ఈ సమస్త సృష్టి ఈశునిచే - నియామకునిచే (ఈశ ఐశ్వర్యే - నియమనే) వ్యాపించబడి ఉంది. **యత్ కించ జగత్యాం జగత్ =** అతి చిన్న కణం నుండి సమస్త బ్రహ్మాండముల పర్యంతం ఈశుడే వ్యాపించియున్నాడు. ఇదంతా అతనిదే. **తేన త్యక్తేన భుంజీథాః** = అందుచే త్యాగ భావంతో - ఇది నాది కాదు, పరమేశ్వరునిదే అన్న భావంతో నీ కష్టార్జితాన్ని అనుభవించు. **మా గృధః కస్య స్విత్ ధనమ్** = ఎవరి కష్టార్జితమును అన్యాయంగా ఆశించవద్దు. లోభివి కావద్దు.

సృష్టికర్తయైన పరమేశ్వరుడు వేదాల ద్వారా మానవుల కవసరమైన సర్వవిద్యలు ఉపదేశించాడు. ఋగ్వేదం ద్వారా సృష్టిలోని సమస్త పదార్థాల గుణధర్మాలను, సృష్టి నియమాలను (ఫిజిక్స్)ను ఉపదేశించాడు. యజుర్వేదం ద్వారా సృష్టిలోని పదార్థాలను ఏరకంగా ఉపయోగించుకొని ఉన్నతిని పొందాలో, ఏ కర్మలు చేస్తే మానవునికి భౌతిక ఆధ్యాత్మిక ఉన్నతులు కలుగుతాయో వివరించాడు. సామవేదం ద్వారా అంతర్ముఖులై ఆత్మ పరమాత్మల సాక్షాత్కారం పొంది సమస్త దుఃఖాలనుండి విముక్తిని పొందే సాధనా క్రమాన్ని తెలిపాడు.

మహదానందాన్ని (బ్రహ్మానందాన్ని) పొందే మార్గం చూపాడు. అథర్వవేదం ద్వారా సృష్టిలోని పదార్థాలతో అద్భుతమైన ఆవిష్కారాలు చేసి విశేష సుఖాలు అనుభవించగల విజ్ఞానాన్ని (సైన్స్ అండ్ టెక్నాలజీని) ఉపదేశించాడు.

పై వేదమంత్రం యజుర్వేదంలోనిది. చివరి అధ్యాయం (40వది) 'ఈశావాస్య మిదం సర్వమ్...' అనే వాక్యంతో ప్రారంభమౌతుంది. అందుచే ఈ అధ్యాయం 'ఈశోపనిషత్' అనే పేరుతో లోకంలో ప్రాచుర్యం పొందింది. కర్మకాండ యొక్క పరమ లక్ష్యం పరమేశ్వర ప్రాప్తి. జన్మ జరా వ్యాధి మరణాది సమస్త దుఃఖాల నుండి విముక్తిని పొంది పరమేశ్వరుని తృతీయాధామంలో స్వేచ్ఛగా విహరిస్తూ మహదానందాన్ని పొందటం. అందుకు కావలసిన జ్ఞాన విజ్ఞానాలను, జీవన విధానాన్ని, సాధన క్రమాన్ని ఈ అధ్యాయం వివరిస్తున్నది. కనుక దీనిని విద్వాంసులు 'ఉపనిషత్' అని ప్రచారం చేశారు. ఇక దీనిలోని మొదటి మంత్రం ఏ సందేశం ఇస్తున్నదో తెలుసుకుందాము.

## 'ఈశావాస్య మిదం సర్వమ్'

ఈ సమస్త సృష్టి ఈశునిచే – నియామకునిచే వ్యాప్తమై – ఆవరింపబడి ఉంది. ఇది అతనిది. అతడు సృజించినది. సృష్టిలోని పదార్థాలన్నీ అణు సంయోగాలే. కోటానుకోట్ల అణువులు కలిస్తేనే ఒక చిన్న పదార్థమై మనకు కనబడుతుంది. ఉదాహరణకు ఒక నీటిబొట్టును పరిశీలించినట్లైతే – ఎన్నో నీటి అణువులు కనబడతాయి. ఒక నీటి అణువును విశ్లేషిస్తే 2 హైడ్రోజన్ అణువులు, ఒక ఆక్సిజన్ అణువు ($H_2O$) ఉంటాయి. ఒక హైడ్రోజన్ అణువులో ఒక న్యూట్రాన్, ఒక ప్రొటాన్ కేంద్రకంలో ఉండగా ఒక ఎలక్ట్రాన్ వాటిచుట్టూ వేగంగా పరిభ్రమిస్తూ ఉంటుందట. అట్లే, ఆక్సిజన్ అణువులో 8 న్యూట్రాన్లు, 8 ప్రొటాన్లు కేంద్రకంలో ఉండగా వాటిచుట్టూ 8 ఎలక్ట్రాన్లు పరిభ్రమిస్తూ ఉంటాయట. ఈ పరిభ్రమణం సూర్యుని చుట్టూ గ్రహాల పరిభ్రమణం వలె నిర్ణీతమైన కక్ష్యలలో జరుగుతుందట. ఇంతవరకు శాస్త్రవేత్తలు 92 రకాల అణువులను – ధాతువులను (ఎలిమెంట్స్‌ను) గుర్తించారు. ఇవేకాక మరికొన్ని అరుదైన (సుమారు 18) ధాతువులు గుర్తించి ఈ సంఖ్యను 110 వరకు చేశారు. ఇవన్నీ వింటున్నపుడు చదువుతున్నపుడు వీటిని ఈవిధంగా నిర్మించినదెవరు? నియమించి

నడుపుతున్నదెవరు? అనే ప్రశ్నలు రాక మానవు. అందుచేతనే ఆస్తికులు సృష్టికి కర్త ఒకడున్నాడంటారు.

సృష్టికర్తను గురించి ప్రపంచ మతాలలో భిన్న భిన్న అభిప్రాయాలున్నాయి. వాటిలో వేదం సృష్టికర్త సర్వవ్యాపకుడంటుంది. అతడే ఒకే ఒక డంటుంది. ఎవరి సహాయం లేకుండానే తానొక్కడే సృష్టిని నిర్మించాడనీ, నియమించి నడిపిస్తున్నాడనీ, కాలాంతరంలో ఇపుడు కలిసివున్న అణువులను విడగొట్టి ప్రళయం చేస్తాడనీ వేదం చెబుతుంది. ఇంతేగాక, రకరకాల ప్రాణి జాతులను సృజించినదీ, ఆ మానవుడు చేసే కర్మలకు ఫలితాల నిస్తున్నదీ కూడా ఆ ఏకేశ్వరుడే అంటుంది. అతని పరిమాణం అనంతం, అతని శక్తులు అనంతం అంటుంది. ఈ విషయాన్నే మరింత స్పష్టం చేస్తూ మంత్రంలోని తదుపరి వాక్యం...

## 'యత్ కించ జగత్యాం జగత్'

సృష్టిలో అతి చిన్నదైన అణువు మొదలు గతిశీలమైన సమస్త నక్షత్రరాశుల (గెలాక్సీల) వరకు ఒకే ఈశుడు వ్యాపించి ఉన్నాడంటుంది వేదం. 'జగత్' అనే పదంలోనే ఈ సృష్టి అంతా గతిశీలమైనదనే అర్థం ఉంది. ఆ అర్థానికి మరింత బలాన్ని చేకూరుస్తూ 'జగత్యాం' అనే విశేషణం జోడించబడింది. జ్ఞానపూర్వకంగా ఒక ప్రయోజనం కొరకు ఏర్పాటు చేయబడిన గమనాన్నే - భ్రమణాన్నే గతి అంటారు. అట్టి గతి మనకు అణువులలోను కనబడుతున్నది. సూర్య కుటుంబాలలోను కనబడుతున్నది. కనుక సృష్టిని జగత్ అంటుంది వేదం. అట్టి జగత్‌కు ఆధారం కూడా ఈశుడే - పరమేశ్వరుడే. సృష్టిని నిర్మించినది గతివంతం చేస్తున్నది, చిత్రవిచిత్రమైన ప్రాణి జాతులను సృష్టించినది అతడే. మన శరీరాలలోనూ ఈ గతి కనబడుతున్నది. ఈ శరీరాలను జీవింప చేస్తున్నది, మనం చేసే శుభాశుభ కర్మలకు అత్యంత న్యాయంగా ఫలాలనిస్తున్నది కూడా అతడే. ఈశుడే. కనుక ...

## 'తేన త్యక్తేన భుంజీథాః'

"ఓ మానవులారా! మీరు కష్టించి సంపాదించిన దానిపైన కూడా అహంకార మమకారాలను పెంచుకోవద్దు. ఏదో ఒకనాడు మీరు వీటన్నిటిని వదలి

వెళ్ళవలసిందే. ఈ సంపదలను నిర్మించినది, వాటిలో వ్యాపించి ఉన్నది, వాటిని సంపాదించుకోగల యింద్రియాలను బుద్ధిని శక్తిని యిచ్చినది నేనే కదా!" అంటున్నాడు సృష్టికర్త. కనుక మనం మనకు లభించిన పదార్థాలను పరమేశ్వరుని ప్రసాదంగా భావించి అనుభవిద్దాం. వాటిలో కొంతభాగం తోటి మానవులకు, కొన్ని ప్రాణులకు పెట్టి పుణ్యం సంపాదించుకుందాం. అభ్యుదయాన్ని – ఈ లోకంలోనూ పరలోకంలోనూ (వచ్చే జన్మలోనూ) ఉన్నతిని పొందుదాము.

త్యాగగుణం మనలో ఎంతగా వికసిస్తుందో అంతగా మనం భగవంతునికి దగ్గరౌతాము. **"త్యాగేనైకే అమృతత్వ మానశుః"** అంటాయి ఉపనిషత్తులు. ఒక్క త్యాగంతో మాత్రమే మనం అమృతత్వాన్ని – జన్మ రాహిత్యాన్ని – పరమానంద ప్రాప్తిని పొందగలమని ఋషుల అభిప్రాయం. **"పరోపకారః పుణ్యాయ"** అని చెప్పినట్లు పరోపకారం వల్ల మాత్రమే పుణ్యం వస్తుంది. మిగతా వ్రత తపాదులన్నీ ఆత్మశుద్ధి కొరకు మాత్రమే. కనుక, వీలైనంత ఎక్కువగా తను మనోధనములతో సత్పాత్రులను సేవించాలి. ఆ సత్కర్మల ఫలాన్ని కూడా భగవదర్పితం చెయ్యాలి. త్యాగం చెయ్యాలి. అట్టి దానినే కర్మఫలత్యాగం అంటారు. ఆ పుణ్యంతో ఏ భౌతిక ప్రతిఫలాన్ని కోరకుండా జన్మరాహిత్యాన్ని – ముక్తిని మాత్రమే కోరుకోవాలి. అప్పుడే మనకు భౌతిక సుఖాలపై వైరాగ్యం, భగవంతునిపై అనురాగం పెరుగుతాయి. అవి మనకు క్రమంగా అమృతత్వాన్ని, పరమానంద ప్రాప్తిని కలిగిస్తాయి. ఇట్టి దానినే కర్మయోగ మంటారు.

దీని తదుపరి వాక్యం మరొక ఉపదేశం చేస్తున్నది. అది మరింత ఆవశ్యకం. దానిని ఆచరించకపోతే మనకు కష్టాలు తప్పవు.

## 'మా గృధః కస్య స్విద్ధనమ్'

### (ఎవరి ధనాన్నీ అన్యాయంగా ఆశించవద్దు. లోభివి కావద్దు.)

ప్రతీ వ్యక్తి పూర్ణ పురుషార్థం చేసి కష్టార్జితంతోనే జీవించ యత్నించాలి. అది చేయలేని బాలబాలికలు, వికలాంగులు, రోగులు, వృద్ధులు మాత్రమే తల్లిదండ్రుల బంధు బాంధవుల భాగ్యవంతుల సహకారంతో జీవించాలి. వృద్ధులు సంతానంపై ఆధారపడి జీవించవచ్చు. అలా చేస్తే సంతానం యొక్క పితృఋణం (తల్లిదండ్రుల ఋణం) తీరుతుంది. మిగిలినవారంతా కష్టించి జీవించాలి.

దొంగిలించిగాని, మోసం చేసిగాని, దౌర్జన్యం చేసిగాని, మరొక వక్రమార్గంలో గాని ఇతరుల ధనాన్ని - సంపదలను ఆశించకూడదు. అలా చేస్తే పరాన్నభుక్కులై పాపులౌతారు.

సోమరితనం ఎంతమాత్రం మంచిది కాదు. సోమరి తల్లిదండ్రులకు, సమాజానికి, దేశానికి కూడా భారమౌతాడు. పాపి అవుతాడు. **'అకర్మా దస్యుః'** అంటుంది ఋగ్వేదం (10-22-8). అంటే - అకర్మణ్యుడు - కష్టపడని సోమరి దస్యుడౌతాడు. పురుషార్థపరుడే ఆర్యుడు. లాటరీలపైనా, షేర్‌మార్కెట్లపైనా రకరకాల పందెముల పైనా వచ్చే ధనాదులను కూడా ఆశించవద్దంటుంది వేదం. **'అక్షైర్మా దీవ్యః కృషిమిత్ కృషస్వ'** ఋగ్వేదం (10-34-11). అంటే జూదరి వంటి అత్యాశ మంచిది కాదు. వ్యవసాయదారునివలె కష్టించి దానికి తగిన ఫలితాన్ని మాత్రమే కోరుకోమని అర్థం. లాటరీలు మొదలగునవన్నీ జూదం క్రిందకే వస్తాయి. కష్టపడకుండా భాగ్యవంతులమైపోవాలనే భావమే వీరందరికి ఉంటుంది.

ఈ చివరి వాక్యాన్ని రెండు చిన్న చిన్న వాక్యాలుగా చేసి కూడా అర్థం చెప్పుకోవచ్చు. **'మా గృధః'** - లోభివి, పిసినారివి (కంజూషివి) కావద్దు. కష్టార్జితాన్ని నీవు చక్కగా అనుభవించి, లేనివారికి కొంత పెట్టు. లేకుంటే నీ తరువాత అది ఏమౌతుందో తెలియదు. **'కస్యస్విద్ధనమ్'** - ఇది ఎవరి ధనము? అనే ప్రశ్న మరియు అందులోనే సమాధానంగా - ఇది పరమేశ్వరుని ధనం ఏ ఒక్కరిది కాదు, అందరికొరకు సృష్టికర్త సృజించినదనే అర్థం కూడా ఇమిడి ఉంది. కనుక త్యాగభావంతో మనం మన కష్టార్జితాన్ని అనుభవిద్దాం. శుభమస్తు. మనకు శు భమగును గాక!

## సృష్టికర్త సందేశం - 2

# సత్కర్మలు చేస్తూనే నూరేండ్లు జీవించగోరుము

**ఓం కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషేచ్ఛతం సమాః ।**
**ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మలిప్యతే నరే ॥**

- యజుర్వేదం 40-2

ఓ మానవా! వేదం ద్వారా నేనుపదేశించిన సత్కర్మల నాచరిస్తూనే నూరేండ్లు

జీవించగోరుము. వాటివల్ల కలుగు పుణ్యఫలాలను – ధన కనక వస్తు వాహనాది భౌతిక సుఖాలనుగాని, క్షణిక ఇంద్రియ సుఖాలనుగాని ఆశించక ఆ పుణ్యమును నా కర్పింపుము. తద్వారా వైరాగ్యరూప పరమశాంతి, పరమానందము నీకు లభిస్తాయి. కర్మలు సంసార బంధనాలు కాకుండా ఉండాలంటే ఇంతకన్న వేరొక మార్గం లేనేలేదు.

ఈ వేదమంత్రం ద్వారా వైదిక కర్మయోగాన్నంతా ఒక సూత్రంగా సృష్టికర్త మన కుపదేశించాడు. ఈ మంత్రాన్ని మనం ఎంతగా మననం చేస్తే (ఆలోచిస్తే) అంతగా దీని అర్థం మనకు అవగతమౌతుంది. కర్మయోగి యైన మన దేవకీపుత్ర శ్రీకృష్ణుడు ఈ మంత్రాన్ని విశేషంగా మననం చెయ్యటమేగాక, ధ్యానసాధన చేసి సమాధిస్థితిని పొంది – సృష్టికర్తను దర్శించి ఈ మంత్రార్థాన్ని సాక్షాత్కారం చేసుకున్నాడు. అతడు గొప్ప ఋషి. ఇంతేగాక, వైదిక కర్మయోగాన్ని తాను స్వయంగా ఆచరించి చూపించాడు. భగవద్గీత ద్వారా ఆ కర్మయోగాన్ని సామాన్య మానవులకు వివరించి చెప్పాడు. అతడు మనకు పరమ ఆప్తుడు. ఆ శ్రీకృష్ణవాణి మహాప్రళయం వరకు నిలిచియే ఉంటుంది. అస్తు.

మానవ జన్మను "కర్మయోని" అన్నారు మన ఋషులు. ఇక్కడ యోని అంటే 'జాతి' అని అర్థం చేసుకోవాలి. 84 లక్షల జీవజాతులలో మానవు డొక్కడు మాత్రమే కర్మలు చేయగలడు. ఒక ప్రక్క ప్రారబ్ధాన్ని అనుభవిస్తూనే పురుషార్థం చేస్తూ భౌతిక ఆధ్యాత్మిక ఉన్నతులను పొందగలుగుతాడు. అందుకు ముఖ్యంగా పరమేశ్వరుడు మానవులకు ప్రసాదించిన బుద్ధి కారణంగా ఉంటుంది. దీనితోపాటు 'మనోవాక్కాయము' లనే త్రికరణాలు మానవునిలో వికసించి ఉంటాయి. జ్ఞానేంద్రియాలేకాక కర్మేంద్రియాలలో కాళ్లు చేతులు కర్మలు చేయటానికి మిక్కిలి అనుకూలంగా ఉంటాయి. వాగింద్రియం (స్వరపేటిక) చక్కగా వికసించి ఉంటుంది. దానితో ఎన్నో భాషలు మాట్లాడగలడు. ఎన్నో స్వరాలను ఆలపించగలడు. తన మనోగత భావాలను ప్రకటించగలడు. దానితో కూడా ఇతరులకు ఉపకారం చేయగలడు. (అపకారం కూడా చేయవచ్చు). అందుచేతనే వాక్కును ఒక కరణంగా – సాధనంగా – పనిముట్టుగా మన ఋషులు లెక్కించారు.

ఏ కారణంచేతనైనా మనం తను మనో ధనములతో సత్కర్మలు చేయలేకున్నా,

వాక్కుతో కూడా చేయలేకున్నా మనస్సుతో పరహితాన్ని కోరవచ్చు. బాధలలో కష్టాలలో ఉన్నవారి కొరకు ప్రార్థనలు చేయవచ్చు. **"లోకాః సమస్తాః సుఖినో భవన్తు"** - అంటూ సంకల్పాలు చేయవచ్చు. (ఇతరుల నాశనాన్ని కోరుతూ పాపాన్ని కూడా మూటగట్టుకోవచ్చు). ఈ కారణంతోనే మనస్సును మానవుని మూడవ సాధనంగా పేర్కొన్నాయి శాస్త్రాలు.

ఏది పుణ్యకర్మ, ఏది పాపకర్మ అనే విషయంలోనూ మన ఋషులు లోతుగానే ఆలోచించారు. వారు ఏమన్నారంటే-

**శ్లో॥ శ్లోకార్ధేన ప్రవక్ష్యామి యదుక్తం గ్రంథకోటిభిః ।**
**పరోపకారః పుణ్యాయ - పాపాయ పరపీడనమ్ ॥**

ఏ కర్మవల్ల పరులకు ఉపకారం జరుగుతుందో అది పుణ్యకర్మ. దేనివల్ల పరపీడన జరుగుతుందో అది పాపకర్మ. మానవులు చేసే కర్మలలోనే పాపపుణ్యాల ప్రసక్తి ఉంటుంది. మిగతా పశు పక్షి క్రిమి కీటకాది ప్రాణులు చేసే కర్మలలో ఆ ప్రసక్తి ఉండదు. వాటికి అట్టి వివేచన చేసే బుద్ధి కాని, కర్మలు చేయటానికి కావలసిన వికసించిన ఇంద్రియాలు కాని లేవు. అవి జీవన గమనంలో దొంగిలించి తిన్నా, చంపితిన్నా, మరొకరకంగా ప్రాణులను హింసించినా బాధించినా వాటికా పాపం రాదు. అంటదు. అవే పనులు మానవుడు చేస్తే తప్పక ఆ పాపం అంటుకుంటుంది. ఎట్లో ఈ జన్మలో తప్పించుకున్నా రాబోవు జన్మలలో ఆ పాపఫలం అనుభవించక తప్పదు. అందుకనే **"అవశ్య మను భోక్తవ్యం కృతం కర్మ శుభా శుభం । నా భుంక్తే క్షీయతే కర్మ కల్పకోటి శతైరపి ॥"** అన్నారు వ్యాసమహర్షి.

"సత్కర్మల ఫలం సుఖం, దుష్కర్మల ఫలం దుఃఖం" అనేది సృష్టి నియమం. కర్మఫలాలు ఎవరు ఇస్తున్నారు? అనే విషయంలోనూ ఋషులు లోతుగానే అధ్యయనం చేశారు. ప్రకృతి జడం (జ్ఞానం లేనిది) కనుక అది స్వయంగా వివేచన చేసి కర్మఫలాల నివ్వలేదు. మానవులలో కొందరికి ఆ సామర్థ్యం కొంతవరకు ఉంటుంది. కాని వారు సర్వవ్యాపకులు, సర్వజ్ఞులు, సర్వశక్తిమంతులు కారు. కనుక రాజులు, న్యాయమూర్తులు సాక్ష్యాధారాలు ఉంటేనే కొంతవరకు కర్మ ఫలాలు ఇవ్వగలుగుతారు. అందుచేత సృష్టికర్తయైన పరమేశ్వరుడే కర్మఫలాల నిస్తున్నాడని

దర్శన శాస్త్రాలంటాయి.

పరమేశ్వరుడు ప్రసాదించిన బుద్ధితో మనం పరిశీలనాదృష్టితో ప్రపంచాన్ని వీక్షిస్తే మానవులు పొందే సుఖభోగాలలో అంతరాలు కనబడతాయి. కొందరి జీవితాలు అన్నీ సుఖాలే సుఖాలు కాగా కొందరి జీవితాలు కష్టాల పరంపరతో కడుహీనంగా దీనంగా కనబడతాయి. దరిద్రంతో, దుర్బలతతో, వ్యాధులతో, బాధలతో, అవమానాలతో, అపనిందలతో రకరకాల దుఃఖాల ననుభవిస్తారు. మిగిలినవారు కొన్ని సుఖాలు కొన్ని కష్టాలు అనుభవిస్తూ మధ్యరకంగా ఎట్లో జీవనయాత్ర సాగిస్తూ ఉంటారు. సృష్టికర్తయైన దేవునకు పక్షపాతం ఉండదు కదా! మరి, ఈ వ్యత్యాసాలకు కారణమేమిటి?

పై ప్రశ్నకు మన వైదిక ధర్మమే చక్కటి సమాధానం చెబుతుంది. జీవునకు ఇది ఒక్కటే జన్మకాదు. పూర్వం అనేకానేక జన్మలు గతించాయి. అనేకానేక జన్మలు రానున్నాయి. దేవునివలెనే జీవుడునూ అనాది స్వరూపుడు. క్రొత్తగా పుట్టలేదు. **"న జాయతే మ్రియతే వా కదా చిత్, నాయం భూత్వా భవితా వా న భూయః । అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే ॥"** గీత. (2-20) కనుక సుఖభోగాలలోని అంతరాలకు పూర్వజన్మలలో చేసిన కర్మలే కారణం. వాటిని సరిచేసుకొని ఉన్నతిని పొందటానికే పరమేశ్వరుడు మనకు మానవజన్మ నిచ్చాడు. కనుక సదా సత్కర్మల నాచరిస్తూనే వీలైనంత ఎక్కువకాలం జీవించ యత్నించాలి. వీలైనంత ఎక్కువ పుణ్యాన్ని ఆర్జించ యత్నించాలి.

కేవలం పుణ్యజీవులై ప్రాపంచిక సుఖభోగాలలోనే కాలం గడపటం, అదే మానవ జీవన పరమ లక్ష్యం అనుకోవడం కూడా అంత మంచిది కాదంటారు మన ఋషులు. ఆ సుఖభోగాలు మనలో రాగాన్ని పెంచుతాయేకాని శాంతింపచేయవు. ఇంద్రియాలలోని ఆ బలమైన సంస్కారాలు **"ఇంద్రియాని ప్రమాథీని హరంతి ప్రసభం మనః"** గీత. (2-60) అని చెప్పినట్లు అవి మన వివేకాన్ని అణచివేస్తాయి. మనను పాపం వైపు పురికొల్పుతాయి. కష్టాలపాలు చేస్తాయి. కనుక ధర్మార్థకామాల వరకే పరిమితమైపోక మోక్షాన్ని – జన్మరాహిత్యాన్ని – పరమానందరూప ముక్తిని పొంద విశేష ప్రయత్నం చెయ్యాలి. అందుకు 'కర్మఫల త్యాగం' ఒక ఉపాయం.

అంటే సత్కర్మలు చేస్తూ వాటివల్ల వచ్చే పుణ్యాన్ని పరమేశ్వరున కర్పిస్తూ ఉండాలి. అలా చేస్తూ ఉంటే క్రమంగా మనలో క్షణికమైన ప్రాపంచిక సుఖాలపైన రాగం తగ్గిపోతుదంది. పరమానంద స్వరూపుడైన పరమేశ్వరునిపై రాగం పెరుగుతుంది. ఆ జ్ఞాన పూర్వక వైరాగ్యమే మనను సమస్త దుఃఖాల నుండి – ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక దుఃఖాలన్నిటినుండి విడిపిస్తుంది. దీనినే ముక్తి – జన్మరాహిత్యం అంటారు. అదే మానవుల పరమలక్ష్యం కావాలంటారు ఋషులు.

భగవద్గీత ద్వారా కృష్ణ భగవానుడు మనకిచ్చిన మరొక ఉపాయమేమంటే – **"యజ్ఞార్థాత్ కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మ బంధనః"** గీత. (3–9) మీరు చేసే సత్కర్మలు యజ్ఞరూపాలు కావాలి. లేకుంటే అవి కూడా మీకు బంధనాలే అవుతా"యంటాడు. యజ్ఞం – అగ్నిహోత్రం ఏవిధంగా పక్షపాతం లేకుండా ప్రాణులన్నిటికి మేలు చేస్తూ ఉంటుందో అలాగే మీ కర్తవ్యకర్మలు, సత్కర్మలు పక్షపాతం లేకుండా లోకకళ్యాణం కొరకు – ప్రాణులన్నిటి మేలుకొరకు చెయ్యాలి. అప్పుడవి మీకు బంధనాలు కావు. ఇదే పై వేదమంత్రంలోని రెండవ పాదం చెబుతున్నది. **"ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మ లిప్యతే నరే"** – కర్మలు బంధనాలు కాకుండా ఉండాలంటే అవి యోగేశ్వర శ్రీకృష్ణుడు చెప్పినట్లు యజ్ఞాలు కావాలి. నిత్యం రెండువేళలా సంధ్యాగ్ని హోత్రాలు చేస్తూ ఈ భావాలను మనలో నింపుకోవాలి. యజ్ఞం – అగ్నిహోత్రం మనకు పాఠశాల కావాలి. అస్తు.

## సృష్టికర్త సందేశం – 3

# అంతరాత్మ మాట వినకుంటే అధోగతియే

**ఓం అసుర్యా నామ తే లోకా అంధేన తమసావృతాః ।**
**తాన్ స్తే ప్రేత్యాపి గచ్ఛంతి యే కే చాత్మహనో జనాః ॥**

– యజుర్వేదం 40–3

ఎవరు అంధకారరూప అజ్ఞానంతో ఆవరింపబడతారో వారు ఆత్మహంతకులై అంతరాత్మ – అంతర్వాణి మాటలను లక్ష్యపెట్టక ఆ ప్రబోధానికి విరుద్ధంగా ప్రవర్తిస్తారు. అట్టి మానవులు ప్రాణపోషకులై – ఇంద్రియ దాసులై దుష్కర్మల నాచరిస్తారు. పాపాన్ని మూట గట్టుకుంటారు. అట్టివారు చచ్చియు అట్టి అసుర

జన్మలనే – క్షుద్ర జన్మలనే పొందుతారు. కనుక, ఓ మానవా! అంతరాత్మ ప్రేరణలను నిర్లక్ష్యం చేసి కష్టాల పాలు కావద్దు.

ఆధ్యాత్మిక క్షేత్రంలో "అంతర్యామి, అంతరాత్మ, అంతర్వాణి" అనే మాటలు తరచు ప్రయోగింపబడతాయి. వీటిని గూర్చిన స్పష్టమైన అర్థాలు చాలామందికి తెలియదు. ముందుగా వీటిని గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాము. అంతర్యామి అంటే అన్నిటిలోపల ఉండి అన్నిటిని 'యామి' నియమించేవాడని అర్థం. మనం **"ఈశావాస్య మిదం సర్వం యత్కించ జగత్యాం జగత్"** – యజుర్వేదం. (40–1) మంత్రంలో తెలుసుకున్నట్లుగా ఈ చరాచర జగత్తంతా ఒక నియామకశక్తిచే (ఈశునిచే) వ్యాప్తమై ఉంది. అది అణువులలోని పరమాణువుల నియంత్రిక గతికి కారణమౌతూ ప్రతీ అణువులోను ఉండి ఆయా మూలకాల (ఎలిమెంట్ల) యొక్క ధర్మాలు (గుణగణాలు) విచ్ఛిన్నం కాకుండా కాపాడుతున్నది. అట్లే, విశ్వంలోని సూర్యకుటుంబాలను నియమించి నడుపుతున్నది. ప్రాణుల శరీరాలలోని ఆయా అవయవాల ధర్మాలను నియమించి నడుపుతున్నది. వాటిని నిర్మించినది, రక్షిస్తున్నది కూడా అంతర్యామియే.

ఇంతేగాక, అంతర్యామి మన శరీరాలలోని ఇంద్రియాలలోను, మనోబుద్ధులలోను, జీవాత్మలమైన మనలోను కూడా వ్యాపించియున్నాడు. అందుకనే, 'సర్వాంతర్యామి' అనే పేరు వచ్చింది. ఆ సర్వాంతర్యామి మన ఉన్నతిని కాంక్షిస్తూ అందుకు తగిన సత్కర్మలు చేయటానికి తగిన శరీరాన్ని, జ్ఞాన కర్మేంద్రియాలను వాక్కును, మనసును నిర్మించి యిచ్చాడు.

అందుచేతనే మానవ శరీరం (మానవ జన్మ) ఉన్నతిని పొందటానికి తగిన చక్కటి సాధనం. మన మనోవాక్కాయాలలో వ్యాపించియుండి వాటితో మనం చేసే ప్రతీ కర్మను తెలుసుకుంటూ వాటికి తగిన ఫలాల నిచ్చేది కూడా సర్వాంతర్యామియే.

## అంతరాత్మ ప్రబోధమే అంతర్వాణి

సర్వాంతర్యామియైన పరమేశ్వరుడు మనకు చేస్తున్న మరొక మహోపకారమేమంటే – మనం ఇంద్రియలోలత వల్లగానీ, ప్రలోభాలకు వశులమైకానీ ఏదైనా అధర్మకార్యం (చెడుకార్యం) చేస్తున్నపుడు వెంటనే మన లోపల

నుండి భయాన్ని, బిడియాన్ని (సిగ్గును), సంకోచాన్ని కలిగిస్తూ హెచ్చరిస్తాడు. "పట్టుబడితే పరువుపోతుంది. కష్టాలపాలు కావలసివస్తుంది. జాగ్రత్త! చెయ్యకుండా ఉండటమే ఉత్తమం" అనే మౌన సందేశం యిస్తాడు. దీనినే అంతరాత్మ ప్రబోధం – అంతర్వాణి అంటారు. బుద్ధిమంతుడు వెంటనే ఆ అంతర్వాణిని గ్రహించి సర్దుకుంటాడు. తన ఇంద్రియ మనోబుద్ధులను నిగ్రహించుకుంటాడు. ఆ పాప కార్యం చెయ్యకుండా ఉంటాడు. ఈ సందేశాన్నే యోగేశ్వర శ్రీకృష్ణుడు – ఒక ఉపమానం (ఉదాహరణం) ద్వారా బోధిస్తాడు.

**"శ్లో॥ యదా సంహరతే చాయం కూర్మో౽ంగానీవ సర్వశః ।**
**ఇంద్రియాణీంద్రియార్థేభ్యః తస్యప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥"**
– భగవద్గీత. 2–58

తాబేలు తనకు ఏదైనా ఆపద సంభవిస్తుందనే భయమేర్పడితే వెంటనే తన అంగాలను (తలను, నాలుగు కాళ్ళను) లోనికి ముడుచుకుంటుంది. అట్లే వివేకవంతుడు అంతర్వాణి హెచ్చరికను గుర్తించి ఇంద్రియాలను ఇంద్రియార్థాలవైపు పోకుండా నిగ్రహించుకోవాలి. ఆ విధంగా నిగ్రహించుకోగల వ్యక్తినే 'స్థిత ప్రజ్ఞు' డంటారు.

స్థితప్రజ్ఞుడే ఇహ పర సుఖాలను పొందుతాడు. ఆధ్యాత్మిక మార్గంలో పురోగమిస్తాడు. ఆత్మానందాన్ని పొందుతాడు. లేకుంటే చాలా నష్టపోతాడు. ఈ లోకంలో అవమానాల పాలవుతాడు. కష్టాల పాలవుతాడు. చచ్చియు అసుర జన్మలనే పొంది మరిన్ని కష్టాల ననుభవిస్తాడు. ఇంద్రియ లోలుడై వాటికి దాసులైన వారినే అసురు లంటాయి శాస్త్రాలు. **"అసుసు దేహేంద్రియ విషయేషు రమన్తే ఇత్యసురాః"** అని నిర్వచనం.

## అంతర్వాణిని నిర్లక్ష్యం చెయ్యుటమే ఆత్మహననం

కొందరు ఈ విధంగా వచ్చే అంతరాత్మ ప్రబోధాన్ని నిర్లక్ష్యం చేస్తారు. అంతఃశత్రువులైన కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలకు వశులై దుష్కర్మ లాచరిస్తారు. అట్టివారిలో క్రమంగా అంతర్వాణి అంతరిస్తుంది. హెచ్చరికలు తగ్గిపోతాయి. మనం కూడా అంతేకదా! 10, 20 సార్లు చెప్పినా వినకుంటే చెప్పటం తగ్గించుకుంటాం. క్రమంగా మానుకుంటాం. వాడి కర్మకు వాడిని వదిలి

పెడతాము. అట్లే అంతరాత్మ ప్రబోధం ఆగిపోతుంది. దానితో ఆ పాడుపని అతని స్వభావంగా మారిపోతుంది. బందిపోటు దొంగలు, కిరాయి గుండాలు, కిరాయి హంతకులు ఇటువంటివారే. వారికి వారు చేస్తున్నది పాపకార్యమని కూడా అనిపించదు. వారికి అది అలవాటుగా (హాబీ), వినోదంగా (హాబీగా) మారిపోతుంది. ఇటువంటివారిని గురించే పై వేదమంత్రం హెచ్చరిస్తున్నది. **"తాన్స్తే ప్రేత్యాపి గచ్ఛంతి యే కే చాత్మహనో జనాః"** అంటున్నది. అంతర్వాణిని చంపుకున్న ఆత్మహనులు చచ్చి కూడా అట్టి అసుర జన్మలనే పొందుతారంటున్నది. పశు పక్షి క్రిమి కీటకాది క్షుద్ర జన్మలను పొందుతారంటున్నది.

## "కర్మ వైచిత్ర్యాత్ సృష్టి వైచిత్ర్యమ్"

పరమేశ్వరుని ఈ చిత్ర విచిత్ర సృష్టిలో 84 లక్షల జీవజాతులున్నాయంటాయి మన శాస్త్రాలు. బ్యాక్టీరియా జాతులను కలుపుకుంటే ఈ సంఖ్య మరింత పెరుగుతుంది. పరమేశ్వరుడు ఇన్నిరకాల జీవజాతులను (ప్రాణులను) ఏల సృజించవలసి వచ్చింది? అని ప్రశ్నించుకొని మన ఋషులు చాలా ఆలోచించారు. మానవులు చేసే కర్మలు అతి విచిత్రంగా ఉంటాయి కనుక ఆ కర్మఫలాలు అనుభవింపచేయటానకి ఏవో కొన్నిరకాల శరీరాలే (జాతులే) సరిపోవు. ఇంతేగాక, మానవుల కర్మలు సత్త్వరజస్తమోగుణ భేదాలతోను, మృదు మధ్యమ తీవ్ర హెచ్చుతగ్గులతోను ఉంటాయి. ఆ వ్యక్తి యొక్క వయస్సు, బౌద్ధిక స్థాయి, సామాజిక వైయక్తిక స్థాయి, దేశకాల పరిస్థితులు మొదలైనవెన్నో ఉంటాయి. వీటన్నిటిని పరిగణనలోకి తీసుకొని న్యాయంగా కర్మఫలాల నివ్వటం చాలా కష్టమైన పనే. సర్వవ్యాపకుడు, సర్వజ్ఞుడు, సర్వశక్తిమంతుడునైన సృష్టికర్త మాత్రమే సరియైన న్యాయం చెయ్యగలుగుతాడు.

లోకంలోని ఎంతటి ప్రతిభావంతులైనా న్యాయమూర్తులైనా అపరాధికి అత్యంత న్యాయంగా శిక్షనివ్వలేరు. పట్టుబడి తగిన సాక్ష్యాధారాలుంటేనే శరీరంతో చేసిన దుష్కర్మలకు తగిన శిక్ష చెప్పగలరు. మనోవాక్కులతో చేసే కర్మలకు ఫలాల నివ్వలేరు.

## మనోవాక్కులతో చేసేవి కూడా కర్మలే

సృష్టికర్త న్యాయస్థానంలో మనస్సుతో చేసే దుష్ట ఆలోచనలకు, నాలుగు గోడల మధ్య జరిగే వాగ్దూషణాదులకు కూడా కర్మఫలాలుంటాయి. పరులకు అపకారం చెయ్యాలనీ, వారిని అవమాన పరచాలనీ, బాధించాలనీ, చంపాలనీ చేసే ఆలోచనలను సర్వవ్యాపకుడు కనుక సృష్టికర్త తెలుసుకుంటాడు. తగిన దండన యిస్తాడు. పరుల నాశనం కొరకు చేసే ప్రార్థనలకును దండన ఉంటుందని వేదం చెబుతుంది.

ఇక వాక్కుతో చేసే పాపాలు రకరకాలుగా ఉంటాయి. కొందరు పైకి బాగానే కనబడుతూ వాక్కులో ఇతరులను కించపరచి, అవమానపరచి, బాధించి పాపం మూటగట్టుకుంటారు. సభలలో సమావేశాలలో తమ మాటల చమత్కృతితో ఇతరులను అవమానపరచి బాధించేవారు కొందరైతే, గృహాలలో, కార్యాలయాలలో సూటిపోటి మాటలతో వేధించేవారు మరికొందరు. పనివాళ్ళను, సేవకులను పచ్చిబూతులు తిట్టే మహానుభావులూ కొందరుంటారు. వీరంతా సృష్టికర్త దృష్టిలో దోషులే. పశు పక్షి క్రిమి కీటకాది ఆసురీ జన్మలే సృష్టికర్త విధించే శిక్షలు.

కనుక, మిత్రులారా! మనం మనోవాక్కాయాలతో చేసే ప్రతీ కర్మకు ఫలముంటుందనేది మరువకండి. కర్మఫలాలనిచ్చే సృష్టికర్త సర్వవ్యాపకుడనీ, మన మనోవాక్కాయాలలోను, జీవాత్మలమైన మనలో కూడా వ్యాపించి యున్నాడని గుర్తించండి. మనం ఏదైనా అధర్మకార్యం చేస్తున్నప్పుడు భయం, ఆందోళన, సిగ్గు, సంకోచం, ఎవరైనా చూస్తున్నారేమోనని అనుమానం వస్తూ వుంటే అవన్నీ అంతర్యామియైన పరమేశ్వరుని నుండి వస్తున్నాయని తెలుసుకోండి. వెంటనే ఆ పని ఆపివేసి పశ్చాత్తాపపడండి. దీనికి భిన్నంగా అంతర్వాణిని నిర్లక్ష్యం చేస్తే ఆత్మహనులౌతారు. అధోగతి పాలౌతారు. కష్టాల పాలౌతారు. తస్మాత్ జాగ్రత్త.

## సృష్టికర్త సందేశం - 4

# కదలని దేవుడు మనస్సుకన్న వేగవంతుడు!!

**ఓం అనేజ దేకం మనసో జవీయో నైనద్దేవా ఆప్నువన్ పూర్వమర్షత్ ।**
**త ద్ధావతో౽న్యా నత్యేతి తిష్ఠత్ తస్మిన్నపో మాతరిశ్వా దధాతి ॥**

- యజుర్వేదం 40-4

ఒకే ఒక్కడైన సృష్టి, స్థితి, లయకర్తయైన పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు. సర్వత్రా నిండి ఉన్న పరిపూర్ణుడు. కనుక అతడు అనేజత్ - చలించడు. కదలడు. అయినా అతడు మనస్సుకన్న వేగవంతుడు. మనస్సుకన్న ముందే - మనస్సు కూడా చేరుకోలేని తావునను వ్యాపించి విద్యమానుడై ఉంటాడు. దివ్యగుణాలు గల చక్షురాది ఇంద్రియాలను దాటి ముందుకు వెళ్ళి ఉంటాడు. అట్టి సర్వవ్యాపక సర్వేశ్వరుని యందే జీవులు తాము మనోవాక్కాయాలతో చేసే కర్మలను అర్పిస్తారు. అతని నుండే వాటి ఫలాలను పొందుతారు.

కర్మకాండను బోధించే యజుర్వేదంలోని చివరి అధ్యాయం (40వ అధ్యాయం) జీవులు చేసే శుభాశుభ కర్మలకు ఫలితాల నిచ్చేవాడు పరమేశ్వరుడేనంటుంది. ఇంతేకాక, ఆ పరమేశ్వరుని స్వరూప స్వభావాలను చాలా స్పష్టంగా చెబుతుంది. పొరబడకుండా సరిగా అర్థం చేసుకోమంటుంది. కనుక మనం ఆ ప్రయత్నం చేద్దాము. అతడు ........

**అనేజత్:** సృష్టికర్త చలించడు. చలించలేడు. కదలటానికి ఖాళీయే లేకుండా సర్వత్రా వ్యాపించి ఉన్న పరమాత్మ ఎలా చలించగలడు? కదలగలడు?

**ఏకమ్:** అతడు ఒకే ఒక్కడు. సృష్టికార్యాలను చేయటంలో అతనికి ఇతరుల సహాయ సహకారా లక్కరలేదు. తానొక్కడే ఈ విశాల విశ్వాన్ని, విశాల ప్రాణికోటిని సృజించగలడు. వాటిని పోషించగలడు. కాలాంతరంలో అన్నిటిని లయించి మూల ప్రకృతిగా మార్చగలడు. లోకంలో అనుకుంటున్నట్లుగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులెవ్వరూ విడివిడిగా లేరు. ఈ మూడు పేర్లు ఆ ఒక్క దేవునివే.

**మనసో జవీయ:** అతడు మనస్సుకన్న వేగవంతుడు. లోకంలో వేగాలను పేర్కొంటూ గుఱ్ఱము, లేడి మొదలగు జంతువులతో పోలుస్తూ అప్పుడప్పుడు అతిశయంగా వాయువేగ మనోవేగాలతో పోలుస్తారు. మనస్సు యొక్క వేగమెంతో మనందరికీ అనుభవమైన విషయమే. ధ్యానం చెయ్యాలని కూర్చుంటే - ఇంద్రియాలన్నిటినీ కట్టి పెట్టగలం కానీ మనస్సును నిలబెట్టటం మనకు సవాలౌతుంది. అంతేకాదు, అది క్షణంలో బదరీ, కేదార్‌నాథ్‌లకు వెళ్ళిపోతుంది. విదేశీ పర్యటన చేసినవారికైతే అమెరికా న్యూజిలాండ్‌లకు కూడా వెళ్ళిపోతుంది.

అప్పుడప్పుడు క్షణంలో చంద్రమండలానికి నక్షత్ర మండలాలకు వెళ్ళి వస్తూ ఉంటుంది. అట్టి అత్యంత వేగవంతమైన మనస్సు కన్నా పరమేశ్వరుడు వేగవంతుడు. అతడు నక్షత్ర రాశులను కూడా దాటి ఉన్నాడు కదా!

**నైనద్దేవా ఆప్నువన్ పూర్వమ్ అర్షత్ / (గచ్ఛత్):** ఇచట ఇంద్రియాలనే దేవతలనటం జరిగింది. మన ఇంద్రియాలు ఎన్నెన్నో దివ్యగుణాలను కలిగి ఉంటాయి. కనుక మన ఆధ్యాత్మిక శాస్త్రాలలో ఇంద్రియాలను దేవతలన్నారు. ఇవియును బయటి ప్రపంచంలోనికి పరుగులు తీస్తూ ఉంటాయి. అట్టి ఇంద్రియాలకన్నను దేవుడు వేగవంతుడు.

**తద్ధావతో అన్యా నత్యేతి తిష్ఠత్:** అట్టి పరుగులు తీసే ఇంద్రియ మనస్సులకన్నా సదా ముందుగానే ఉంటాడు పరమేశ్వరుడు.

ఇది ఒక అలంకారిక వర్ణన. దేవుడు వాటిముందు పరిగెడుతూ ఉంటాడని కాదు. సర్వత్రా వ్యాపించి స్థిరంగా ఉన్నాడని అర్థం చేసుకోవాలి.

**తస్మిన్ అపో మాతరిశ్వా దధాతి:** ఆ సర్వవ్యాపక సర్వేశ్వరునియందే మాతరిశ్వుడు (జీవుడు) తాను చేసే శుభాశుభ కర్మల నర్పిస్తూ వాటి ఫలాలను పొందుతూ ఉంటాడు. సామాన్యంగా అంతరిక్షంలో ఉండే వాయువును 'మాతరి' అంటారు. ఆ వాయువు యొక్క ఆధారంతో తన పనులు చేసుకుంటూ ఉంటాడు కనుక ఇచ్చట జీవుణ్ణి – ముఖ్యంగా మానవుణ్ణి 'మాతరిశ్వు'డనటం జరిగింది.

## కర్మలకు ఫలితాలనిచ్చేది ఎవరు?

మానవుడు ఏదో ఒక ప్రయోజనాన్ని ఆశిస్తూ సదా కర్మలను చేస్తూనే ఉంటాడు. వాటిలో కొన్ని ధార్మికమైనవి సుఖాలను, మరికొన్ని ధార్మికమైనవి కష్టాలను కలుగజేస్తూ ఉంటాయి. అయితే, ఈ కర్మలకు ఫలితాలనిచ్చేది ఎవరు? కర్మలే స్వయంగా ఫలాల నిస్తున్నాయా? లేక ప్రకృతి కర్మఫలాల నిస్తున్నదా? మరి కర్మలు, ప్రకృతి జడములు కదా! జ్ఞానం లేనివి కదా! అవి ఏవిధంగా కర్మలను పరీక్షించి ధర్మాధర్మాలను నిర్ణయించి ఫలాల నివ్వగలవు?

ఈ విషయంపై మన ప్రాచీన ఋషులు చాలా లోతుగానే అధ్యయనం చేశారు. మనన చింతనలు చేశారు. బుద్ధితో పరిశోధనలు చేశారు. వారి

పరిశోధనలను గ్రంథస్థం చేసి మనకిచ్చి వెళ్ళారు. ఆ గ్రంథాలనే దర్శన శాస్త్రాలంటారు. వాటిలో ముఖ్యమైనవి ఆరు. వైశేషిక, న్యాయ, సాంఖ్య, యోగ, మీమాంసా, వేదాంత దర్శనాలు. అవన్నీ చాలా తర్కబద్ధంగాను – హేతుబద్ధంగాను, వైజ్ఞానికంగాను ఉంటాయి. వాటిలో కర్మలను గూర్చిన పరిశోధనల సారాంశమేమంటే – కర్మ పని ముగియగానే దానంతట అదే సమాప్తమైపోతుంది. కనుక కర్మ స్వయంగా కర్తకు ఫలాలనివ్వలేదు. పంచ భూతాత్మకమైన ప్రకృతి జడమైనది – జ్ఞానం లేనిది కనుక అది ధర్మాధర్మాలను విచారించి ఫలితాలనివ్వలేదు. కర్మఫలాల నివ్వగల జ్ఞానం, శక్తి సామర్థ్యాలు గల తత్త్వం కేవలం పరమాత్మయే. అది సర్వవ్యాపకమై సర్వసాక్షియై కర్మఫలాల నిస్తున్నదని ఋషులు సిద్ధాంతీకరరించారు.

పరమాత్మ తత్త్వాన్ని అంగీకరించని కొన్ని సాంప్రదాయాలవారు – కర్మ మనస్సులో సంస్కారాన్ని కలిగిస్తుందనీ, అది బీజంగా ఉండి కాలాంతరంలో మొలకెత్తి ఫలాన్నిస్తుందనీ అంటారు. కానీ, మనస్సు కూడా ప్రకృతితో ఏర్పడిన పదార్థమే, కాకపోతే అది కంప్యూటర్ వలె ఉండి విషయాన్ని నిల్వ (Store) చేసి ఉంచుతుంది. అది చిత్రగుప్తుని చిట్టా వంటిది. ఆ చిట్టాను పరిశీలించి న్యాయం చేసేది యమధర్మరాజే – పరమాత్మయే. (ఈ పేరు కూడా ఏకైక దేవునిదే).

ఆ సర్వవ్యాపక సర్వేశ్వరుని గురించి తదుపరి మంత్రం మరికొంత వివరిస్తుంది.

**ఓం తదేజతి తన్నైజతి తద్దూరే తద్వంతికే ।**
**తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః ॥**

– యజు. 40–5

అన్నిటిని చలాయమానం చేసే పరమాత్మతత్త్వం తాను చలించదు. అది అత్యంత దూరంలోనూ ఉంది, అతి సమీపంలోనూ ఉంది. అన్నిటి లోపలా వెలుపలా కూడా ఉంది.

ఈ విశాల సృష్టిలో అంతటా గతిశీలతయే కనబడుతుంది. అణువులలో ఎలక్ట్రాన్లు, విశ్వంలో గ్రహగోళాలు నిరంతరం ఒక క్రమ గతిలో తిరుగుతూనే ఉంటాయి. ఆ తిరిగేవన్నీ ఏ ఆధారంతో తిరుగుతున్నాయి? ఆధారం లేకుండా ఏ

వస్తువు తిరుగలేదు కదా! అవి ఒకటితో ఒకటి ఢీ కొట్టకుండా ఏ తత్త్వం నియమించి నడుపుతోంది? దాని జ్ఞాన, శక్తి సామర్థ్యాలు ఎంత గొప్పవై ఉంటాయి?

ఆ ఇంద్రియ గోచరం కాని విశ్వశక్తినే వేదశాస్త్రాలు దేవుడు అంటాయి. అది చలించక స్థిరంగా ఉంటూనే అన్నిటిని చలాయమానం చేస్తుంది. అన్నిటికి ఆధారంగా ఉంటుంది. అది అత్యంత దూరంలోనూ – అతి చివరి గెలాక్సీలలోనూ ఉంది. అతి సమీపంగా మన శరీరంలోనూ, మనస్సులోనూ, బుద్ధిలోనూ, జీవాత్మలో కూడా వ్యాపించి ఉంది. అన్నిటి లోపలా వెలుపలా ఉంది.

పరమాత్మ తత్త్వం అన్నిటి లోపలా ఎలా ఉంటుందనేది కొందరి జిజ్ఞాసువుల సందేహం. కొన్ని ఉపమానాల ద్వారా ఈ విషయం వివరించవచ్చు. సామాన్యంగా స్థూల పదార్థంలో దానికన్న సూక్ష్మ పదార్థం వ్యాపించి ఉండగలుగుతుంది. ఇది సృష్టి నియమం. ఉదా: 1) మట్టిలో నీరుపోస్తే అది నెమ్మదిగా ఇంకిపోయి మట్టి, నీరు ఒకేచోట ఇమిడి ఉంటాయి. 2) నీటిని ఒక పాత్రలో పోసి మరిగిస్తే అగ్ని నీటిలో ప్రవేశించి వ్యాపిస్తుంది. అగ్ని, నీరు ఒకచోట ఇమిడిపోతాయి. అది శరీరం మీద పడితే కాలుస్తుంది. బొబ్బలు ఎక్కిస్తుంది. ఇనుము వంటి గట్టి వస్తువులో కూడా అగ్ని ప్రవేశించగలుగుతుంది. ఆ ఇనుప ఊచను ఎర్రగా చేస్తుంది. దానిని వెంటనే నరికితే లోపల కూడా అగ్ని కనబడుతుంది. అదేవిధంగా పరమాత్మతత్త్వం సృష్టిలోని ప్రతి పదార్థంలోనూ వ్యాపించి ఉంటుంది. అది అన్నిటికన్నను సూక్ష్మాతి సూక్ష్మమైనది.

## తదంతరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః

తత్ పదంతో వ్యవహరించే ఆ పరమేశ్వర తత్త్వం అన్నిటిలోపలా వెలుపలా కూడా వ్యాపించి ఉంది. ఈ విషయం ఒక ఉపమానం ద్వారా బాగా అర్థమవుతుంది. మనం దూదితో రకరకాల బొమ్మలు చేసి హిందూ మహాసముద్రంలో చాలాదూరం తీసుకుపోయి సముద్రంలో ముంచి పట్టుకుంటే ఏమవుతుంది? బొమ్మలలో నీరు ప్రవేశించి లోపల బయటా కూడా సముద్రమే ఉంటుంది. అలాగే ఈ సమస్త విశ్వము, అందలి సమస్త ప్రాణులు పరమాత్మ అనే సాగరంలో ఉన్నాయి. లోపల వెలుపల అంతట పరమాత్మరూప సాగరమే ఉంటుంది. ఈ విషయాన్ని గురించి బాగా ఆలోచించండి. మననం చేయండి.

అర్థం చేసుకోండి. జ్ఞానభక్తిని పెంచుకొని ఆత్మోన్నతిని పొందండి.

**సృష్టికర్త సందేశం - 5**

# ఓ మానవా! శోక మోహాలను జయించు

**ఓం యస్తు సర్వాణి భూతా న్యాత్మ న్నేవానుపశ్యతి ।**
**సర్వభూతేషు చాత్మానం తతో న విచికిత్సతి ॥**

**ఓం యస్మిన్ త్సర్వాణి భూతాన్యాత్మైవాభూద్ విజానతః ।**
**తత్ర కో మోహః కః శోకః ఏకత్వ మనుపశ్యతః ॥**

- యజుర్వేదం 40-6, 7

ఏ వివేకవంతుడు సర్వవ్యాపక పరమాత్మయందే సమస్త జడచేతన భూతములు ఉన్నవని గ్రహిస్తాడో మరియు ఆ వ్యాపకతత్త్వం సమస్త ప్రాణులలోను సమానంగా ఉన్నదని గ్రహిస్తాడో అట్టివానికి సందేహానికి తావులేని స్పష్టమైన పరమాత్మజ్ఞానం కలుగుతుంది.

**తతో న విచికిత్సతి:** ఆ విధంగా తెలుసుకున్నవానికి మాత్రమే పరమాత్మను గూర్చిన సంశయాలుండవు.

అట్టి విశేష జ్ఞానదృష్టి కలిగిన వివేకి సమస్త ప్రాణులు తనవంటివేనని గ్రహిస్తాడు. ఇతర ప్రాణులకు కలుగుచున్న సుఖదుఃఖాలను చూచి అవి తనకు కలుగుతున్నట్లుగానే స్పందించి సహకరిస్తాడు. ఇంతేగాక, అతడు "ఈ శరీరానికి సంబంధించినవారే తనవారనీ ఇతరులు తనవారు కారనీ" అనుకునే మోహానికి గురికాడు. కనుక అతనికి శోకమే ఉండదు. (సంసార మోహమున్న వానికే కదా శోకము!)

మనం పూర్వ పుటలలో తెలిసికొన్నట్లుగా ఈ సమస్త విశ్వము - సమస్త జగత్తు, సమస్త ప్రాణులు పరమాత్మ సాగరంలో ఉన్నాయి. ఆ సాగరం మన లోపలా వెలుపలా ఓతప్రోతమై ఉంది. ఈ జ్ఞానాన్ని మనం జీర్ణించుకోగలిగితే పైరెండు మంత్రాల సందేశం మనకు బాగా అర్థం అవుతుంది.

లోకంలో దేవుని గూర్చిన అభిప్రాయాలు కోకొల్లలు. దేవుడు తనవంటి

ఆకారంతోనే మనిషిని చేశాడనీ, అతడు 4వ ఆకాశంలో ఉంటాడనీ ఒక గ్రంథం చెబుతుంది. మరొక గ్రంథం – లేదు లేదు దేవుడు 7వ ఆకాశంలో ఉంటాడంటుంది; వేరొక గ్రంథం కైలాసంలో అర్ధనారీశ్వరునిగా ఉంటాడంటుంది. కొందరు వైకుంఠంలో నాలుగు చేతులలో శంఖు చక్ర గదా పద్మములు ధరించి తన భక్తులను అనుగ్రహిస్తూ ఉంటాడంటారు. అప్పుడప్పుడు ధర్మసంస్థాపన చెయ్యటానికి భూమిపై అవతరిస్తాడంటారు. (అవతరణం అంటే పైనుండి క్రిందికి దిగటమని అర్థం). మరికొందరు వీరందరూ అసలు దేవుళ్ళు కారు. మా దేవియే అసలైన దైవం అంటారు. ఆమెనే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను సృజించి ముగ్గురికి మూడు బాధ్యతలను అప్పగించి సృష్టి, స్థితి, లయలను చేయమంది కనుక ఆ అమ్మనే దైవంగా ఆరాధించాలనీ, ఉపాసించాలనీ అంటారు. ఇట్టి వారంతా దేవుని స్వరూపాన్ని అసలు గ్రహించనే లేదని చెప్పాలి.

ఇట్టి కథలను విన్న వివేకవంతులకు పెక్కు సందేహాలు కలగటం సహజమే. సృష్టి, స్థితి, లయ కర్త ఒక్కడే ఉంటాడు గానీ మతానికి ఒక దేవుడు, సాంప్రదాయానికి ఒక దేవుడు ఉంటారా? పై వాటిలో ఏ కథ సత్యం? దేవుడు అసలు ఎక్కడ ఉంటాడు? భార్యాపిల్లలు సంసారం ఉన్నవాడు దేవుడు ఎలా అవుతాడు? దేవుడు అజ్ఞానానికి ఎందుకు గురి అవుతాడు? పిచ్చి పిచ్చి వరాలు ఎందుకు ఇస్తాడు? తనను ఆరాధించేవారికి సుఖాలను, ఆరాధించనివారికి కష్టాలను ఎందుకిస్తాడు? దేవుడు సర్వప్రాణులకు మేలు చేసేవాడు కావాలి కదా! ఇటువంటివే ఎన్నెన్నో ప్రశ్నలు. వీటికి సరియైన సమాధానాలు దొరకక కొందరు నాస్తికులుగా, నక్సలైట్లుగా, కమ్యూనిస్టులుగా మారిపోతున్నారు. ఇట్టి ప్రశ్నలన్నింటికి సరియైన సమాధానం చెప్పగలిగింది మన వేదం ఒక్కటే.

ఋగ్వేద దశమ మండలంలోని 10 మంత్రాలు గల 121వ "హిరణ్యగర్భ సూక్తం" సృష్టి, స్థితి, లయాలు మూడిటినీ చేస్తున్నదీ, అన్నిటికి ఆధారంగా ఉన్నదీ కూడా ఒకే ఒక్క దేవుడంటుంది. **"హిరణ్యగర్భః సమవర్త తాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్"** అంటూ ప్రారంభమైన ఈ సూక్తం – అతడు సర్వవ్యాపకుడనీ, అతనికి ఆకారం లేదనీ, అన్నిటిలో వ్యాపించి అన్నిటిని ధరించి నియమించి నడిపిస్తున్నాడనీ అంటున్నది. సృష్టిలోని సూర్యచంద్రాది గోళాలు, భూమిమీది నదులు, సముద్రాలు, పర్వతాలు ఆయన మహిమలను, క్రియలను, శక్తులను

తెలుపుతున్నాయంటుంది. ఈ ప్రాకృతిక దేవతలన్నిటికీ అతడే ఏకైక అధిదేవుడంటున్నది. **యో దేవేష్వధి దేవ ఏక ఆసీత్** (ఋ. 10-121-8) అంటున్నది.

అతడు సుఖస్వరూపుడనీ, దుఃఖరహిత అఖండ ఆనంద స్వరూపుడనీ, అతడు నీలోనే వ్యాపించి అత్యంత సన్నిహితుడుగా ఉన్నాడని చెబుతుంది. అట్టి అంతర్యామిని **"కస్మై దేవాయ హవిషా విధేమ"** అని ప్రార్థించమంటుంది, ఉపాసించమంటుంది. ఇట్టి వేదమంత్రాలు 4 వేదాలలోను వేలకొలది ఉన్నాయి.

ఈ విధంగా పరమేశ్వరుని అర్థం చేసుకున్నవారు మాత్రమే **'న విచికిత్సతి'** దేవుని విషయంలో సంశయ రహితులు, సందేహ రహితులు అవుతారంటుంది పై మంత్రాలలోని మొదటి మంత్రం. అట్టి జ్ఞానులే మోహానికి, శోకానికి గురికారంటుంది రెండవ మంత్రం.

మోహమనేది అరిషడ్వర్గాలలో ఒకటి. మనకు బయట శత్రువులున్నట్లే మన మనస్సులోనూ కొందరు శత్రువులుంటారు. వారినే అంతః శత్రువులనీ, అరిషడ్వర్గాలనీ అంటారు. అవే – కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు. వీటిని గురించి సంక్షిప్తంగా తెలుసుకుందాము. **కామ మంటే** ఇంద్రియాలతో సుఖాలనుభవించాలనే కోరికలు. కంటితో తనకు నచ్చిన మంచి రూపాలు, దృశ్యాలు మరల మరల చూడాలనీ, చెవులతో తనకు నచ్చిన సంగీతాన్ని, మాటలను, ప్రశంసలను మరల మరల వినాలనీ కోరుకోవటం. అట్లే, నాలుకతో మనకు నచ్చిన రుచులను, చర్మంతో స్పర్శలను, ముక్కుతో సుగంధాలను మరల మరల అనుభవించాలనే కోరికలను కామ మంటారు. ఇవి మితంగాను, ధర్మబద్ధంగాను ఉంటే పెద్దగా ప్రమాదం ఉండదు. కాని, అవి ధర్మాన్ని తప్పి ప్రవర్తిస్తే శత్రువులౌతాయి. మనని పతితులను చేస్తాయి.

**'క్రోధం'** అంటే – తన కోరికలకు అడ్డుగా ఉండేవారిపై కలిగే కోపం. ఇది కొందరిలో తీవ్రంగాను కొందరిలో మధ్యమంగాను ఉంటుంది. కొందరికి అకారణంగా కూడా కొందరిపై కోపముంటుంది. దీని వెనుక ఆ వ్యక్తిపై దాగివున్న ద్వేషం ఉంటుంది. క్రోధం తీవ్రమైతే అది బుద్ధిని నశింపచేస్తుందనీ, దానితో మనిషి 'ప్రణశ్యతి – పతనం' చెందుతాడనీ భగవద్గీత (2-63) హెచ్చరిస్తుంది.

ఇతరుల ధనాన్ని, కష్టాన్ని ఆశించటాన్ని **'లోభ'** మంటారు. మోహం గురించి కొంత వివరంగా తదుపరి పేరాలలో తెలుసుకుందాము.

**'మదం'** అంటే గర్వం, అహంకారం.

**'మాత్సర్య'** మంటే – అసూయ. ఒకరి బాగును చూసి ఓర్వలేకపోవటం.

**'మోహం'** – అంటే దేహాత్మ భ్రాంతితో వచ్చే అజ్ఞానం, మమకారం. శరీరంలో జీవుడు శరీరానికన్న వేరుగా ఉంటాడు. రథంలో కూర్చున్న రాజుగా ఉంటాడు. కాని, అజ్ఞానంవల్ల తన అసలు స్వరూపాన్ని మరచి దేహమే తాను అనుకుంటాడు జీవుడు. దేహంతో ఏర్పడిన సంబంధీకులనే తనవారు అనుకుంటాడు. ముఖ్యంగా భార్యపిల్లలపైన మమకారాన్ని పెంచుకుంటాడు. నా భార్య, నా పిల్లలు, నా బంధువులు, నా ఆస్తులు అనుకుంటూ వారి యోగక్షేమాలే తన యోగక్షేమాలనుకుంటాడు. వారికేదైనా కష్టం కలిగినా, నష్టం జరిగినా తనకే కలిగినట్లు బాధపడతాడు. అట్లని తన సంబంధీకులందరిపైన మోహం సమానంగా ఉండదు. కొందరికి భార్యపైనా, కొందరికి పుత్రులపైన, కొందరికి పుత్రికలపైన మోహం ఉంటుంది. అదియును అందరి పుత్రులపైన సమానంగా ఉండదు. పెద్దకొడుకు పైననో, చిన్నకొడుకు పైననో ఎక్కువగా ఉంటుంది. దానితోవారు పక్షపాతంతో వ్యవహరించి అధర్మాత్ములౌతారు. పాపభాగులౌతారు. ఇటువంటి మోహాన్ని సంసారమోహం అంటారు.

సంసార మోహానికి భిన్నంగా కొందరికి ధనంపైనా, కొందరికి పేరు ప్రతిష్ఠలపైనా, కొందరికి అధికారంపైన ఈవిధంగా రకరకాల మోహాలు కలిగి ఉంటారు. ఇట్టివారు అంతా సవ్యంగా జరిగితే – తాననుకున్నట్లు జరిగితే సంతోషిస్తారు. లేకుంటే క్రోధానికి గురియై ఉగ్రులై పోతారు... దానితో వివేకం నశించి వాటిని తిరిగి పొందటానికి అధర్మ మార్గాల ననుసరించి పాపులౌతారు లేదా కృంగిపోతారు. డిప్రెషన్‌కు (Depression కు) గురి అవుతారు.

ధన మోహ మున్నవారు భార్యా పిల్లలకన్న, బంధువులకన్న, ధనానికే ప్రాధాన్యతనిస్తారు. అందుకోసం తనవారిని కూడా హింసిస్తారు. అబద్ధాలాడతారు. అవినీతికి పాల్పడతారు. ఆ విధంగా కూడబెట్టిన ధనాన్ని వదిలి పెట్టలేరు. ఖర్చు పెట్టలేరు. దానధర్మాల మాట అటుంచి తనవారి గురించి, తన గురించి కూడా

ఖర్చుపెట్ట మనసు రాదు. **"తేన త్యక్తేన భుంజీథాః** – యజుర్వేదం (40–1)" అనే వేదోపదేశం వారికి నచ్చదు. ఇట్టి ధనమోహులు అధర్మాత్ములై పాపులౌతారు. చివరికి ఆ ధనమే వారిని శోకగ్రస్తులను చేస్తుంది. ఇట్టివన్నీ తన అసలు స్వరూపాన్ని, పరమేశ్వరుని స్వరూపాన్ని తెలియనివారే చేస్తారు. సర్వభూతాలు, సర్వప్రాణులు పరమేశ్వరునిలోనే ఉన్నాయనీ, వాటన్నిటిలోను పరమేశ్వరుడు సమానంగా వ్యాపించి ఉన్నాడనీ గ్రహించినవాడు మోహానికి గురికాడు. మోహం లేనివానికి శోకమే ఉండదు.

దయానంద మహర్షి ఈ మంత్రంలోని **"సర్వాణి భూతాని ఆత్మా ఇవ అభూత్"** అనే వాక్యానికి విశేషంగా భాష్యం వ్రాస్తూ – "సరియైన ఆత్మజ్ఞానం కలిగిన విద్వాంసుడు పరమాత్మలో సంచరించు సమస్త ప్రాణులను తనతో సమానమైనవిగా గుర్తిస్తాడు. వాటికి కలిగే సుఖదుఃఖాలను తనకు కలిగినట్లుగా ఎంచి చక్కగా స్పందించి సాయం చేస్తాడు. సర్వవ్యాపక సర్వేశ్వరునే ఆరాధిస్తాడు. ఉపాసిస్తాడు. అట్టి జ్ఞానికి శోక, మోహ లోభాదులెన్నటికి కలుగవు. తన యథార్థ స్వరూపాన్ని, పరమాత్మ స్వరూపాన్ని చక్కగా తెలిసికొన్నవాడు ఎల్లప్పుడు సుఖాలనే పొందుతూ ఉంటా"డని వ్రాశారు.

## సృష్టికర్త సందేశం – 6

# సృష్టికర్త యొక్క యథార్థ స్వరూప స్వభావాలు

**స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ మస్నావిరం**
**శుద్ధ మపాప విద్ధమ్, కవిర్ మనీషీ పరిభూః స్వయంభూర్**
**యాథా తథ్యతోఽర్థాన్ వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః ॥**

– యజుర్వేదం 40–8

పై మంత్రం ద్వారా సృష్టికర్త తన స్వరూప స్వభావాలను అల్పజ్ఞులమైన మనకు వివరించి చెప్పుచున్నాడు. "ఓ మానవులారా! అవాఙ్మానస గోచరుడనైన నన్ను గూర్చి మీరు లేనిపోని కల్పనలు చేయవద్దు. నా యథార్థ స్వరూపాన్ని ఉన్నది ఉన్నట్లుగా తెలుసుకోండి. నా స్వరూపాన్ని పొరబడకుండా తెలుసుకున్నవాడు మాత్రమే అమృతత్వాన్ని పొందగలడు. **'తమేవ విద్వాన్ న బిభాయ మృత్యోః'**

– అథర్వవేదం (10–8–44) అట్టి విద్వాంసుడు మాత్రమే మృత్యువునకు భయపడడు. దానిని జయించి అమృతత్త్వాన్ని – ముక్తిని – సర్వదుఃఖ రాహిత్యాన్ని పొందుతాడు. ఆ జీవుడు జనన మరణరూప చక్ర బంధనాన్నుండి తప్పించుకుని **"అమృత మానశానా తృతీయే ధామన్ అధ్యైరయన్త ॥"** – యజు (32–10), ఆనంద స్వరూపుడనైన నాలో స్వేచ్ఛగా విహరిస్తాడు" అంటున్నాడు. ఇట్టి మంత్రాలు వేదాలలో చాలానే ఉన్నాయి.

కనుక మనం చెయ్యవలసిన అత్యంత పురుషార్థం (ప్రయత్నం) మోక్షం కొరకు ప్రయత్నించటమే. **"త్రివిధ దుఃఖ అత్యంత నివృత్తి రత్యంత పురుషార్థః"** – అని చెప్పినట్లు ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికములనే త్రివిధ దుఃఖాలనుండి పూర్తిగా విముక్తిని పొందటమే అత్యంత పురుషార్థం. అదే పరమ పురుషార్థం. అందుకు పరమాత్మ యొక్క యథార్థ స్వరూప స్వభావాలు చక్కగా (Clear గా) తెలుసుకోవటం మొదటి సాధనంగా ఉంటుంది. దీనినే 'జ్ఞానం' అంటారు. ఆ తరువాత ఆ జ్ఞానానికి అనుగుణంగా జీవించాలి – ఆచరించాలి. దీనిని 'కర్మ' అంటారు. తరువాతది ఉపాసన – ఏకాంతంలో కూర్చుని మనస్సును అంతర్ముఖం చేస్తూ జీవాత్మలమైన మనలో వ్యాపించియున్న ఆ సర్వవ్యాపక సర్వేశ్వరుని వెతకటం. వీటినే జ్ఞానకర్మ ఉపాసనలుగా శాస్త్రాలు పేర్కొంటాయి. అందులో మొదటిదైన పరమాత్మ జ్ఞానాన్ని పైమంత్రం మనకు స్పష్టంగా చెబుతుంది. కనుక, పై మంత్రంలోని ప్రతీ పదమును చక్కగా అర్థం చేసుకోవటానికి ప్రయత్నిద్దాం. క్రింది పదములలోని సంస్కృతార్థం మహర్షి దయానందుల వారి యజుర్వేద భాష్యం నుండి గ్రహించబడినది.

**సః** = ఆ పరమాత్మతత్త్వం. సామాన్యంగా సంస్కృత భాషలో 'సః' అంటే అతడు. ఇక్కడ పూర్వపు మంత్రాలలో చెప్పబడిన పరమాత్మగా – ఈశునిగా మనం అర్థం చేసుకోవాలి. వేదాలలో 'ఓం, తత్, సత్' అను పదములతోను, అనేక గుణకర్మ స్వభావ వాచక నామములతోను, సః, యః, యేన మొదలైన సర్వనామములతోను పేర్కొనబడిన పరమాత్మతత్త్వం ఒక్కటే. ఆ నామములు కొన్ని పుంలింగంలోను, కొన్ని స్త్రీలింగంలోను, కొన్ని నపుంసకలింగంలోను చెప్పబడ్డాయి. అట్లని ఆ తత్త్వం పురుషుడు కాదు, స్త్రీ కాదు, నపుంసకుడునూ కాదు. పేర్లెన్ని ఉన్నా, సర్వనామాలెన్ని ఉన్నా – **"ఏకం సత్ విప్రా బహుధా వదంతి అగ్ని యమం మాతరిశ్వాన**

**మాహుః ॥"** ఋగ్వేదం (1-164-46) ఆ సత్ పదార్థం ఒకే ఒక్కటి. దానినే విప్రులు (జ్ఞానులు) అగ్ని, యముడు, మాతరిశ్వుడు మొదలైన బహునామములతో పిలుస్తారంటుంది వేదం. అట్టి తత్త్వం.

**పరి+అగాత్ =** పర్యగాత్ = 'సర్వతః వ్యాప్తోఽస్తి' ఈ సృష్టిలో అంతటా వ్యాపించియున్నది. అన్నిటిని అన్నివైపులనుండి ఆలింగనం చేసుకొని అన్నిటిలో ప్రవేశించి యున్నది. స్థూల పదార్థాలలోనే కాక సూక్ష్మములైన మనోబుద్ధులలోను, వాటికన్న సూక్ష్మములైన జీవాత్మలలోను కూడా అది వ్యాపించియున్నది.

**శుక్రమ్** = 'ఆశుకరం సర్వశక్తి మత్' = అది అత్యంత శీఘ్రకారి (వేగవంతమైనది). మనస్సు కన్నను వేగవంతమైనది (మనసో జవీయః). ఇంతేగాక ఈ తత్త్వం సర్వశక్తివంతమైనది. ఈ సృష్టిని నిర్మించుటలోను, పాలించుటలోను, కాలాంతరంలో ప్రళయం చేయుటలోను అది ఎవరి సహాయ సహకారాలను అపేక్షించదు - కోరదు. జీవులు చేసే కర్మలకు ఫలాలను పంచుటలో కూడా అది ఎవరి సహకారాన్ని అపేక్షించదు. అన్నిటిని ఆ ఒక్క తత్త్వమే చేయగలదు. అది శుక్రమ్ = సర్వశక్తులు గలది.

**అకాయం** = 'స్థూల సూక్ష్మకారణ రహితమ్' = స్థూల సూక్ష్మకారణ శరీరాలు లేనిది. ఆ తత్త్వానికి మనకువలె అవయవాలతోను ఇంద్రియాలతోను కూడిన స్థూల శరీరం కాని, మనోబుద్ధులతో కూడిన సూక్ష్మశరీరం కాని, సత్త్వము రజస్సు తమస్సులతో కూడిన కారణ శరీరంకాని లేవు. ఉండవు. అది గాలివలె, ఆకాశంవలె వ్యాపించి ఉండే తత్త్వం.

**అవ్రణమ్** = 'అచ్ఛిద్ర మచ్ఛేద్యం' = దానికి ఛిద్రాలు (రంధ్రాలు) లేవు, వ్రణాలు లేవు. గాయాలు కావు. అది దేనితోను ఛేదింపబడదు. ఖండితం కాదు. ఖండింపబడదు.

**అస్నావిరం** = 'నాడ్యాది సంబంధ బంధ రహితమ్' = అది మనవలె నాడులు మొదలైన వాటితో బంధింపబడదు. ప్రాణులలో నాడీమండలం (Nervous System) ఉంటుంది. అది శరీరంలోని అన్ని అవయవాలలో వ్యాపించి సుఖదుఃఖాల అనుభవాలను కలిగిస్తుంది. అట్టి నాడీబంధనం సృష్టికర్తకు ఉండదు. ఇంతేగాక, ఆ తత్త్వం ఎప్పటికిని నాడీ బంధనంలోకి రాదు. జీవాత్మలవలె ఏ తల్లి గర్భంలోనో

ప్రవేశించి శరీరధారణ చెయ్యదు. కనుక అవతారవాదం వేదవిరుద్ధం.

ఆ పరమాత్మ అసురుల రాక్షసుల దుష్టుల దుర్మార్గుల శరీరాలలో కూడా వ్యాపించి ఉంటుంది. కనుక అట్టివారిని శిక్షించటానికి, చంపటానికి దేవునికి శరీరధారణ చెయ్యవలసిన అవసరమేముంది? వారి గుండెను, శ్వాసను ఆపివేస్తే సరిపోతుంది కదా!

**శుద్ధమ్** = 'అవిద్యాది దోషరహితత్వాత్ సదా పవిత్రమ్' = ఆ విశ్వవ్యాపకతత్త్వం సదా శుద్ధంగానే ఉంటుంది. ఎన్నటికిని అశుద్ధిని పొందదు. జీవులమైన మనకు స్థూల సూక్ష్మకారణ శరీరాలున్నాయి. కనుక, అవి జీవన క్రమంలో అశుద్ధమౌతూ ఉంటాయి. మలినమౌతూ ఉంటాయి. దేవునకు అట్టి శరీరాలు లేవు కనుక అతడు సదా పవిత్రుడు. ఇంతేగాక, జీవులమైన మనకు అవిద్య, అస్మిత, రాగం, ద్వేషం, అభినివేశం అనే అయిదు దోషాలు (మలినాలు) అంటుతూ ఉంటాయి. వాటిని విద్యా జ్ఞానాలతోను తపస్సుతోను శుద్ధి చేసుకుంటూ ఉండాలి. కాని దేవునకు అట్టి సూక్ష్మదోషాలు (మాలిన్యాలు) కూడా అంటవు, అతడు సదా పవిత్రుడు.

దేవుడు సర్వవ్యాపకుడైతే మలమూత్రాలలో కూడా వ్యాపించి ఉండవలసి వస్తుంది కదా! కనుక దేవుడు బ్రహ్మలోకంలోనో, వైకుంఠంలోనో, కైలాసంలోనో, 4వ ఆకాశంలోనో, 7వ ఆకాశంలోనో ఉంటాడంటారు కొన్ని సాంప్రదాయాలవారు. రాజు రాజధానిలో ఉంటూ రాజ్యాన్ని పాలిస్తున్నట్లే దేవుడు ఆయా లోకాలలో ఉంటూ సృష్టిని పాలిస్తున్నాడంటారు. కాని, అట్లైతే చాలా వ్యవస్థలు కావాలి. అనేకమంది మంత్రులు, సేనాపతులు, సైనికులు, సిబ్బంది కావలసివస్తుంది. అట్టి పాలన ప్రజలకు పూర్తి న్యాయాన్ని కలిగించలేదు. ఇంతేగాక, ఎన్నో లోపాలు జరుగుతాయి.

**అపాపవిద్ధమ్** = 'యత్ పాపయుక్తం పాపకారి పాపప్రియం కదాచిత్ న భవతి తత్' = ఎవరు పాపయుక్తుడు, పాపకారి, పాపప్రియుడు ఎన్నటికిని కాడో అట్టివాడు.

లోకంలో అవతారవాదులు ఒక అవతారంలో చేసిన పాపాలను మరొక అవతారంలో అనుభవించినట్లు, చేసిన ఋణాలను తీర్చుచున్నట్లును చెబుతూ ఉంటారు. కాని ఈ మంత్రం దేవుడు పాపపుణ్యాలతో అంటబడడని స్పష్టంగా చెబుతున్నది. అతని సృష్టికర్మలు, కర్మఫల వ్యవస్థా అన్నీ జీవులమేలు కొరకే. అవి

న్యాయస్థానంలో న్యాయమూర్తి కర్మలవంటివి. అవి పుణ్యమును కావు. పాపమును కావు.

**కవిః** = 'సర్వజ్ఞః' = అతడు సర్వజ్ఞుడు. వేదకావ్య రచయిత. సృష్టికావ్య రచయిత కూడా. అతని కావ్యాలలో కల్పనలు ఉండనే ఉండవు. అవన్నీ ఋతములు – నిత్య సత్యములు.

**మనీషీ** = 'సర్వేషాం జీవానాం మనోవృత్తీనాం వేత్తా' = సర్వజీవుల మనోవృత్తులను (ఆలోచనలను) తెలుసుకొనువాడు.

**పరిభూః** = 'యో దుష్టాన్ పాపినః పరిభవతి తిరస్కరోతి సః' = దుష్టులను పాపులను వారెంతటి శక్తిశాలురైనా అణచి పెట్టగలవాడు.

**స్వయంభూః** = 'అనాది స్వరూపో యస్య సంయోగేన ఉత్పత్తిర్ వియోగే న వినాశో మాతా పితరౌ గర్భవాసో జన్మ వృద్ధిక్షయౌ చ న విద్యంతే' = అతడు అనాది స్వరూపుడు. లోకంలోని ప్రాణులవలె సంయోగంతో ఏర్పడి వియోగంతో నశించేవాడు కాడు. మాతాపితరులు, గర్భవాసము, జన్మవృద్ధి క్షయములు లేనివాడు.

**యాథాతథ్యతః అర్థాన్ వ్యదధాత్** = 'యథార్థతయా వేద ద్వారా సర్వాన్ పదార్థాన్ విశేషేణ విధత్తే' = అట్టి పరమాత్మ ఆదిమానవ సృష్టికాలంలో ఋషుల ద్వారా మానవులకు సృష్టియొక్క జ్ఞాన విజ్ఞానాలను, కర్తవ్యా కర్తవ్య కర్మలను, పితృయాన దేవయాన మార్గాలను, నిశ్శ్రేయస్సును (ముక్తిని) పొందే మార్గాన్ని యథార్థభావంతో (ఏమాత్రం దాపరికం లేకుండా) వేదరూపంలో అందించాడు.

**శాశ్వతీభ్యః సమాభ్యః** = 'సనాతనీభ్యో అనాది స్వరూపాభ్యః స్వస్వరూపేణోత్పత్తిర్ వినాశ రహితాభ్యః ప్రజాభ్యః' = ఆ వేదం ఎవరికొరకనగా సనాతనులు అనాది స్వరూపులు – స్వరూపంతో ఉత్పత్తి వినాశములులేని ప్రజలకొరకు (జీవుల కొరకు) ముఖ్యంగా మానవుల కొరకు.

మహాశయులారా! ఇంతవరకు మనం తెలుసుకున్న 8 యజుర్వేద మంత్రాల ద్వారా దేవుని యథార్థ స్వరూప స్వభావాలను, గుణకర్మలను తెలుసుకున్నాము. వీటిని గురించి లోతుగా మనన చింతనలు చేయండి. తదుపరి మంత్రాలలో ఏ జ్ఞానం వల్ల ప్రాపంచిక దుఃఖాలను అధిగమించగలమో, ఏ జ్ఞానంవల్ల అమృతత్త్వ ప్రాప్తి లభిస్తుందో, దేహావసాన సమయంలో ఏ జ్ఞానంలో ఉండాలో మొదలైన

విషయాలు తెలుసుకుందాము.

**సృష్టికర్త సందేశం - 7**

# ప్రకృతి వికృతుల రెండిటి జ్ఞానమూ అవసరమే

**అంధం తమః ప్రవిశంతి యేసంభూతి ముపాసతే ।**
**తతో భూయ ఇవ తే తమో య ఉ సంభూత్యాం రతాః ॥**

- యజుర్వేదం 40-9

ఎవరు సృష్టికర్తను విడిచి అసంభూతిని - సృష్టికి ఉపాదానకారణమైన మూల ప్రకృతిని ఉపాసిస్తారో వారు అజ్ఞానాంధకారంలో ప్రవేశిస్తున్నారని తెలుసుకోండి. ఎవరు సంభూతిని అంటే వికృతిని - మూల ప్రకృతి పరిణామ రూపమైన సృష్టిని, భౌతిక సుఖాలను ఉపాసిస్తారో వారు అంతకన్న ఎక్కువైన అజ్ఞానాంధకారంలో ప్రవేశిస్తున్నట్లు గుర్తించండి.

**అన్య దేవాహుః సంభవా దన్య దాహు రసంభవాత్ ।**
**ఇతి శుశ్రుమ ధీరాణామ్ యే నస్తద్ విచచక్షిరే ॥**

- యజుర్వేదం 40-10

కార్యరూప సృష్టిని ఉపాసించటంవల్ల కలిగే ప్రయోజనం వేరనీ, కారణరూప మూల ప్రకృతిని ఉపాసించటంవల్ల కలిగే ప్రయోజనం వేరనీ ధీరులు - ధీశాలురు (విద్వాంసులు, జ్ఞానులు) అంటారు.

**సంభూతిం చ వినాశం చ య స్తద్ వేదోభయం సహ ।**
**వినాశేన మృత్యుం తీర్త్వా సంభూ త్యామృత మశ్నుతే ॥**

- యజుర్వేదం 40-11

అయినప్పటికీ ఈ రెంటిని గురించీ తెలుసుకోవలసిందే. దేనినీ నిర్లక్ష్యం చేయకూడదు. కనుక, రెంటిని జతగానే తెలుసుకోండి. ప్రళయకాలంలో దేనిలో ఈ సృష్టి అంతా విలీనమౌతుందో అట్టి మూలప్రకృతి జ్ఞానంతో మృత్యువును - మృత్యు భయాన్నుండి తరించండి. సంభూతితో - ప్రకృతి పరిణామరూపమైన ఈ శరీర ఇంద్రియాదులతో సాధనచేసి అమృతత్వాన్ని - ముక్తిని పొందండి.

ఈ మంత్రాన్ని గురించి మా గురుదేవులు కీ.శే. పండిత గోపదేవ శాస్త్రిగారు తమ ఉపన్యాసాలలో ఈవిధంగా వివరించి చెప్పేవారు.

**సంభూతిం చ వినాశం చ యస్తద్ వేదో భయగ్ం సహ ।**
౨ **వినాశేన మృత్యుం తీర్త్వా సంభూత్యాఽమృత మశ్నుతే ॥**

**భావార్థము:** ప్రపంచమునందలి పదార్థములలో గల కార్య కారణ భావము వ్యర్థమైనది కాదు. కావున ఆ కార్య కారణముల గుణకర్మ స్వభావముల నెరిగి వానిని ధర్మాది మోక్షసాధనములతో సంయుక్తము చేసికొనవలెను. ఇట్లే మానవ శరీరము అనిత్యము – కార్యరూపము, దానికి కారణ రూపములు గలవు అవి నిత్యములే. కావున మరణ భయమును విడిచి మోక్షసిద్ధికై యత్నింపవలెను. ఇట్లు ఈ కార్యకారణ రూప జగత్తువలన పొందవలసిన ఫలము అన్యము. కార్యకారణ రూప జగత్తునందు రతులు గాక. వానిని త్యజించి పరమాత్మ నుపాసింపవలెనని భావము.

సంభూతి అంటే కార్యజగత్తని, అసంభూతి అంటే యీ కార్యజగత్తుకు మూల కారణమైన ప్రకృతి అని యింతకు పూర్వమే తెలుసుకున్నాం. పరమేశ్వరుని విడిచి యీ రెంటిని ఉపాసించడం యోగ్యం కాదు. ఈ రెంటిని గూర్చి బాగా తెలుసుకోవాలనడం ఉచితమే. మన మహర్షులు కూడా ప్రాకృతిక పదార్థాలను గురించి తెలుసుకొనేవాళ్ళు. కాని ఎంతవరకు? వారికి అవసరమైన వరకే. కేవల ప్రకృతి ఉపాసన అజ్ఞానాన్ని కలిగిస్తుంది. ఈ మంత్రంలో 'వినాశం ద్వారా మృత్యును పోగొట్టుకోవాలి. సంభూతి వల్ల ఆనందం పొందుతాం' – అని చెప్పబడింది. ఇచట వినాశము అంటే మూల ప్రకృతి అని అర్థం. అంటే దేనిలో కార్యరూప పదార్థాలు నశించి విలీనమౌతాయో ఆ కారణరూప జగత్తును మూలప్రకృతి అంటారు. అది నశించదు. ఇక సంభూతి అంటే కార్యపదార్థమైన 'శరీరమని ఇచట అర్థం. ఈ శరీరానికి కారణమేమిటి? ప్రకృతి, శరీరం కార్యం. ఇలా శరీరానికి ప్రకృతికి గల కార్యకారణ సంబంధాన్ని బాగా తెలుసుకోవాలి. వినాశం ద్వారా మృత్యువును పోగొట్టుకోవడమంటే – యీ శరీరం ఎప్పుడైనా నశించేదే, దీనికి కారణభూతమైన ప్రకృతి మాత్రం నశించదు, అనే నిశ్చితజ్ఞానం కలగడంవల్ల మనకు శరీర వియోగం (మృత్యువు) సంభవించినా దుఃఖించబోమని అర్థం.

తరువాత సంభూతి (శరీరం) వలన ఆనందం పొందడమంటే ఏమిటో

తెలుసుకుందాం. జీవుడు యీ మనుష్య శరీరంలోనే మోక్షానందాన్ని సంపాదిస్తాడు. మనుష్య శరీరం లేకపోతే అది సిద్ధించదు. జీవుడు సుఖదుఃఖాలను అనుభవించడానికి శరీరం అవసరం. శరీరం ఉండటంవల్లనే అతడు సుఖదుఃఖముల ననుభవిస్తున్నాడు. కనుక జీవుడు తనకీ శరీరం రావడానికి కారణమేమిటో తెలుసుకొని, ఆ కారణములనుండి విడివడితే అతనికి శరీరం రాదు. అప్పుడు శరీర సంబంధమైన సుఖ దుఃఖములు తొలగి అతడు మోక్షానందాన్ని పొందుతాడు.

నేడు మనం వైజ్ఞానిక యుగంలో జీవనం గడుపుచున్నాము. భౌతిక రసాయనిక శాస్త్రాలు శరవేగంతో పురోగమిస్తున్నాయి. ఇటు అణువులోనికి, అటు విశాల విశ్వంలోనికి విజ్ఞానవేత్తలు దృష్టిని సారిస్తున్నారు. ఎన్నెన్నో పరిశోధనలు, పరీక్షలు చేస్తున్నారు. అణువు లోపలి పరమాణువుల అమరిక, నియంత్రిత గతి, ఆ బంధాలను విడగొడితే జరిగే వినాశాలను చూచి విజ్ఞానవేత్తలే దిగ్భ్రాంతి చెందుచున్నారు. అట్లే, విశ్వం యొక్క విశాలతకు, నియంత్రిత గతికి గల ఆధారము అంతుపట్టడంలేదు. సృష్టి ఎలా ఏర్పడింది? ఏ మూల పదార్థంతో ఏర్పడింది? ఆ మూల పదార్థంతో ఈ అత్యద్భుత సృష్టిని నిర్మించినదెవరు? ప్రకృతియే స్వయంగా పరిణమించి ప్రపంచమయ్యిందా? లేక ఏదైనా అనంత జ్ఞాన విజ్ఞానాలు, అనంత శక్తి సామర్థ్యాలు గల పదార్థం ఈ సృష్టిని నిర్మించినదా? అనేవి నేటి విజ్ఞానవేత్తల ఎదుట ఉన్న ప్రశ్నలు. వీరు ఈ సృష్టిని గురించి మన వేదశాస్త్రాలు ఏమి చెబుతున్నాయో పరిశీలించటం మంచిది. ఎందుకంటే అవి సృష్టికర్త నుండి వచ్చిన జ్ఞాన నిధులు. వాటిలో ఆధ్యాత్మిక విద్యలేకాక భౌతికవిద్యలు కూడా ఉన్నాయి. ముఖ్యంగా సృష్టి రహస్యాలు చాలానే ఉన్నాయి.

విచిత్రంగా వేదాలు ప్రకృతి వికృతుల రెండిటి జ్ఞానమూ అవసరమే నంటున్నాయి. ఇచట వికృతి అంటే వికటించినదని కాదు. లోకంలో వేదప్రచారం సరిగా లేకపోవటంవల్ల నేడు సృష్టినే ప్రకృతిగా భావించి రచయితలు, కవితలు, కావ్యాలు, కథలు వ్రాస్తున్నారు. సృష్టిలోని అద్భుత సౌందర్యాలను ప్రకృతి రమణీయాలుగా వర్ణిస్తున్నారు. శాస్త్రీయ దార్శనిక దృష్టితో చూస్తే సృష్టి ప్రకృతి కాదు. ఇది ప్రకృతి యొక్క పరిణామ రూపం. దీనిని వికృతి అని కూడా అనవచ్చును. **'అంగులీయకం సువర్ణస్య వికృతిః'** అన్నట్లు. అంటే ఉంగరము

బంగారం యొక్క వికృతి. విశేషంగా మార్చబడిన రూపం. అట్లే, ఇచట వికృతి అంటే - మూల ప్రకృతి నుండి విశేషంగా ఏర్పడిన విశ్వసృష్టి అని అర్థం చేసుకోవాలి. పై వేదమంత్రాలు వికృతిని (సృష్టిని) సంభూతిగా పేర్కొంటున్నాయి. 'సంభూతి' అంటే చక్కగా నిర్మించబడినదని అర్థం. మూల ప్రకృతిని 'అసంభూతి' అంటున్నాయి. అంటే అది ఏ మూల పదార్థంతోను నిర్మింపబడలేదనీ, అది అనాది అనీ అర్థం.

మూల ప్రకృతిని మనం ఏ ఇంద్రియంతోను దర్శించలేము. దానికి నామ రూపాలు ఏవీ ఉండవు. అందుకనే దానిని 'అవ్యక్తము' అంటాయి మన శాస్త్రాలు. అటువంటి మూల ప్రకృతిని జీవులమైన మనకొరకు పరమేశ్వరుడు వ్యక్తమయ్యే సృష్టిగా నిర్మించాడు. దానిని దర్శించగల శరీర ఇంద్రియ మనోబుద్ధులను నిర్మించి మనకిచ్చాడు. వీటితో మనం ఈ సృష్టినీ, ఈ మానవ జన్మను సార్థకం చేసుకోవాలి. వేదం చూపే జ్ఞానమార్గంలో సాధనచేసి అభ్యుదయాన్ని - ఇహ పరలోక ఉన్నతులను సాధించాలి. ఇంతేకాక, వీటితో అమృతత్వాన్ని కూడా సాధించమంటున్నాయి పై వేదమంత్రాలు. 'సంభూ త్యామృత మశ్నుతే' అంటున్నాయి.

ఇక మూల ప్రకృతిని గురించి కొద్దిగా తెలుసుకుందాము. ఏవిధంగా పరమేశ్వరుడు, జీవులు అనాది స్వరూపములో అట్లే మూల ప్రకృతియు అనాదియే. అందుచే అది నశించదు. ఉనికి లేకుండా పోదు. కాని, అది ఒకప్పుడు సృష్టిరూపంలోను, మరొకప్పుడు తన మూలరూపంలోను ఉంటుంది. ఆ స్థితినే ప్రళయం అంటారు. ఈ స్థితిని ఋగ్వేద దశమ మండలంలోని కేవలం 7 మంత్రాలు గల 'నాసదీయ సూక్తం' చాలా చక్కగా వివరిస్తుంది. విజ్ఞానవేత్తలు ఆ సూక్త ఆధారంతో పరిశోధనలు సాగిస్తే సృష్టిరచనా విషయాలు కొన్ని తెలుస్తాయి. ఆ సూక్తంలోని ఒక మంత్రం ఈవిధంగా చెబుతున్నది.

**తమ ఆసీత్తమసా గూఢ మగ్రేఽ ప్రకేతం సలిలం సర్వమా ఇదమ్ ।**
**తుచ్ఛ్యే నాభ్వపిహితం యదాసీత్తపసస్తన్మహినా జాయతైకమ్ ॥**

- ఋగ్వేదం 10-129-3

సృష్టికి పూర్వం ఇదంతా అంధకారం వ్యాపించి రాత్రి మాదిరిగా

తెలియబడకుండా ఉంటుంది. అప్పుడు ఈ సృష్టి అంతా కారణరూప సలిలంలో కరిగి ఉంటుంది. ఆ మూల ప్రకృతియు అనంతుడగు దేవునిలో ఏదో ఒక మూల తుచ్ఛంగా – అల్పంగా పడి ఉంటుంది. అట్టి సలిలరూప ప్రకృతిని పరమేశ్వరుడొక్కడే కార్యరూపంగా – నామ రూపాదులు గల సృష్టిగా నిర్మించాడు.

ఇచట సలిలం అంటే నీరు అని కాదు. సరళంగా ఏవిధంగానైనా మార్పు (Mould) చేసుకునేటట్లుగ ఉంటుందని అర్థం. వేదం మరొకచోట ఆ స్థితిని 'అర్ణవ సముద్రం' అంటుంది. అంటే – పరమాణు సాగరంగా – అన్నీ విడివిడి పరమాణువులుగా ఉంటాయి. వాటిని పరమేశ్వరుడు వివిధ నిష్పత్తులలో మేళవించి మూలకాలుగాను (ఎలిమెంట్స్‌గాను) తదుపరి వాటిని వివిధ సమ్మేళనాలుగాను చేసి సృష్టికి తగిన విధంగా మారుస్తాడు. ఇది గొప్ప తపస్సు అంటుంది ఋగ్వేదం. ఈ క్రింది మంత్రాన్ని పరిశీలించండి –

**ఋతం చ సత్యం చాబీద్ధా త్తపసోऽధ్యజాయత ।**
**తతో రాత్ర్యజాయత, తతః సముద్రోऽర్ణవః ॥**

– ఋగ్వేదం 10-190-1

ఇట్టి మంత్రాలను గురించి మననం చేస్తూ – ఆలోచనలు చేస్తూ **కపిల మహర్షి** సమాధి స్థితిలోనికి వెళ్ళాడు. పరమేశ్వరుని నుండి మంత్రార్థాలను స్పష్టంగా తెలుసుకున్నాడు. అనంతరం ఆయన ఒక దర్శనం (తత్త్వశాస్త్రం) వ్రాశాడు. అది ఇప్పుడు 'సాంఖ్య దర్శనం' అనే పేరుతో లభిస్తుంది. అందులో ఆయన మూల ప్రకృతిని గురించి – **"సత్త్వరజస్తమసాం సామ్యావస్థా ప్రకృతిః"** (1-61) అని నిర్వచించాడు. అంటే – సత్వము, రజస్సు, తమస్సు అనబడే 3 రకాల పరమాణువులు సామ్యస్థితిలో ఉన్నప్పుడు అది ప్రకృతి అనబడుతుందని అర్థం. అప్పుడు అది తెలియబడదు. అవ్యక్తంగా ఉంటుంది. పరమేశ్వరుడు వాటిని వివిధ నిష్పత్తులలో కలుపుతూ కలుపుతూ వ్యక్తమయ్యే – కనబడే నామ రూపాత్మక సృష్టిగా చేశాడు. ఈ మూడు రకాల పరమాణువులను నేటి వైజ్ఞానిక పరిభాషలో ప్రోటాన్ (సత్వము), ఎలక్ట్రాన్ (రజస్సు), న్యూట్రాన్ (తమస్సు) లుగా చెప్పవచ్చును.

నేటి యువతరానికి అర్థం కావాలని మహామేధావియైన **పండిత గురుదత్త విద్యార్థి** (1864 – 1890 A.D.) గారు ఈ యజుర్వేద ఈశావాస్య సూక్తానికి

ఆంగ్లంలో వైజ్ఞానిక వ్యాఖ్య వ్రాశారు. వారు సృష్టికర్త సందేశంలోని మొదటి మంత్రానికి ఈ విధంగా వ్యాఖ్య వ్రాశారు.

Miserable are they, who worship atoms as the efficient cause of the world; but far more miserable are they, who worship the visible things made of atoms.

ఈ పం. గురుదత్త గారి ఆంగ్ల వ్యాఖ్య, మహర్షి కపిలుని సాంఖ్యదర్శన అనువాదాలు ఇప్పుడు తెలుగులో లభిస్తాయి. మా గురుదేవులు పూజ్యశ్రీ **పం. గోపదేవ్ శాస్త్రి గారు** అనువదించి ప్రచురించారు. అవి చదివితే ఈ విషయాలు ఇంకా ఎక్కువ వివరంగా తెలుస్తాయి.

## సృష్టికర్త సందేశం - 8

# ఆధ్యాత్మిక విద్యతో అమృతత్త్వాన్ని సాధించు

**అంధం తమః ప్రవిశన్తి యే஽విద్యా ముపాసతే ।**
**తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాం రతాః ॥**

ఎవరు అవిద్యను - ఆత్మ పరమాత్మల విద్యకాని దానిని - భౌతాకవిద్యను ఉపాసిస్తారో వారు అంధకారంలో ప్రవేశిస్తారు. ఎవరు భౌతికవిద్యను విడిచి కేవలం ఆధ్యాత్మిక విద్యనే ఉపాసిస్తారో వారు అంతకన్నను ఎక్కువ అంధకారంలో ప్రవేశిస్తున్నట్లు తెలుసుకోండి.

**అన్యదేవాహుర్ విద్యయా అన్య దాహు రవిద్యయాః ।**
**ఇతి శుశ్రుమ ధీరాణాం యే న స్తద్ విచచక్షిరే ॥**

భౌతిక విద్యలవలన కలిగే ప్రయోజనం వేరనీ, ఆధ్యాత్మికవిద్యవల్ల కలిగే ప్రయోజనం వేరనీ ధీరులు - ధీశాలురు (విద్వాంసులు, జ్ఞానులు, యోగులు) చెబుతారు.

**విద్యాం చావిద్యాం చ యస్తద్ వేదోభయం సహ ।**
**అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయా అమృత మశ్నుతే ॥**

- యజు. 40-12, 13, 14

అందుచే భౌతిక ఆధ్యాత్మిక విద్యల రెంటినీ జతగానే తెలుసుకోండి. అవిద్యతో (భౌతిక విద్యలతో) మృత్యువును – కష్టాలను, వ్యాధులను, బాధలను తరిస్తూ (పోగొట్టుకుంటూ) ఆధ్యాత్మిక విద్యతో అమృతత్త్వాన్ని పొంద తీవ్రమైన సాధన చెయ్యండి.

ముందుగా మనం పై మంత్రాలలోని విద్య, అవిద్య పదములను స్పష్టంగా తెలుసుకునే ప్రయత్నం చేద్దాం. 'విద్య' అనే పదం సంస్కృత వ్యాకరణానుసారం 'విద్–జ్ఞానే' అనే మూల ధాతువుతో (Root తో) నిర్మింపబడుతుంది. కనుక, సంక్షిప్తంగా విద్య అంటే జ్ఞానమని అర్థం. అయినప్పటికి ఆ జ్ఞానం యథావత్తుగా ఉండాలి కనుక – "వేత్తి యథావత్ తత్త్వ పదార్థ స్వరూపం యయా సా విద్యా" అని నిర్వచనం. అంటే – దేనివల్ల పదార్థాల యొక్క యథార్థ స్వరూపం ఉన్నది ఉన్నట్లుగా తెలియబడుతుందో అది విద్య.

ఇక 'అవిద్య' అంటే – విద్యకు భిన్నమైనది. అజ్ఞానం. ఒకదాన్ని మరొకటిగా తలంచటం, నమ్మటం. **"యయా తత్త్వ స్వరూపం న జానాతి భ్రమాద్ అన్యస్మిన్ అన్యత్ నిశ్చినోతి సా అవిద్యా"** అని నిర్వచనం. అయితే అవిద్య పదమునకు మరొక పారిభాషిక అర్థం దర్శన ఉపనిషదాది శాస్త్రాలలో కనబడుతుంది. పతంజలి మహర్షి తమ యోగదర్శన శాస్త్రం (2.5) లో – **"అనిత్యాశుచి దుఃఖానాత్మసు నిత్య శుచి సుఖాత్మా ఖ్యాతి రవిద్యా"** అని వివరించారు. అంటే – అనిత్యాన్ని నిత్యమనీ, అశుచిని శుచియనీ, పరిణామంగా కొన్ని దుఃఖాలు దాగివున్న భౌతిక సుఖాలను నిజమైన సుఖాలనీ, ఆత్మకాని దానిని ఆత్మ అనీ భావించటం, నమ్మటం 'అవిద్య' అంటారు. ఆధ్యాత్మిక ప్రగతినీ, ఆత్మికోన్నతిని కోరువారంతా ఈ చతుర్ముఖ అవిద్యా నిర్వచనాన్ని కూడా అర్థం చేసుకోవటం చాలా అవసరం. స్థలాభావం వల్ల వాటి నిక్కడ వివరించలేకపోవుచున్నాము. యోగసాధన విషయం వచ్చినప్పుడు ఆ విషయాలు తెలుసుకుందాము.

ముండకోపనిషత్తు అవిద్యను 'అపరావిద్య' యనీ, విద్యను 'పరావిద్య' యనీ పేర్కొంటుంది. 'పరా' అంటే శ్రేష్ఠమైనది, గొప్పది అని అర్థం. 'అపరా' అంటే – దాని తదుపరి చెప్పుకో తగినదనీ లేదా పరంపరగా పరావిద్యను చేర్చునది యనీ అర్థం. మేము వీటిని నేటికాలానికి అన్వయిస్తూ అవిద్యను భౌతిక విద్యయనీ,

విద్యను ఆధ్యాత్మిక విద్యయనీ పేర్కొనటం జరిగింది. పై మంత్రాలు అవిద్యతో మృత్యువును – కష్టాలను తరించి, విద్యతో అమరత్వాన్ని పొందుమని ఉ పదేశిస్తున్నాయి. ఇక వాటిని గురించి తెలుసుకుందాము.

## అవిద్యయా మృత్యుం తీర్త్వా

పైన వివరించినట్లుగా అవిద్యతో అంటే – బ్రహ్మవిద్యకాని భౌతిక విద్యలతో మృత్యువును తరించుమని కదా! వేద సందేశం. ఇచట మృత్యువంటే కేవలం మరణమని కాదు. కష్టాలు, బాధలు, రోగాలు మొదలైనవన్నీ అని అర్థం. మనకు వచ్చే కష్టాలకు చాలావరకు అజ్ఞానమే కారణం. తెలిసికాని, తెలియకకాని ప్రకృతి నియమాలను, వేదసందేశాన్ని అనుసరించకపోవటమే. వేదంలోని భౌతికవిద్యలతో, తదనుగుణ జీవనంతో మన కష్టాలను, బాధలను చాలావరకు నివారణ చేసుకోవచ్చు. ఆవిధంగా కూడా నివారణకాని కష్టాలను, బాధలను, రోగాలను బలీయమైన ప్రారబ్ధ ఫలాలుగా గుర్తించాలి. అంటే – పూర్వజన్మలలో మనం చేసిన పాపాలు కారణమని భావించాలి. పశ్చాత్తాపపడి ఇకనుండి ధర్మబద్ధంగా జీవించాలని గట్టి సంకల్పం చేసుకోవాలి. ప్రాయశ్చిత్తంగా కొన్ని దానధర్మాలు, పరోపకారం శక్తికొలది చెయ్యాలి. అంతేకాని మొక్కుబడులతో, తీర్థయాత్రలతో, దొంగ సాధు సంన్యాసుల సేవతో అవి పోవు. ఆత్మజ్ఞానంతో, యోగసాధనలతో – యమ నియమ ఆసన ప్రాణాయామాదులతో శరీరానికి, మనస్సుకు సాక్షిగా ఉ ంటూ కష్టాలనుండి బాధలనుండి కొంత ఉపశమనం పొందవచ్చు.

ఈ మంత్రాలలోని విద్య, అవిద్య పదములకు జ్ఞానము, కర్మ (ప్రయత్నము) అని కూడా అర్థం చేసుకోవచ్చు. ఎందుచేతనంటే – ఈ వేద మంత్రాలకు 'దేవత – ఆత్మ (జీవాత్మ)'. సృష్టికర్త జీవునకు చేస్తున్న ఉపదేశాలు. జీవాత్మ సుపర్ణుడనీ, జ్ఞాన కర్మలనే రెండు రెక్కలుంటాయనీ వేదం పెక్కుచోట్ల చెబుతుంది. ఆ రెక్కలతో జీవుడు భౌతిక ఉన్నతిని, ఆత్మిక ఉన్నతిని, అమరత్వాన్ని కూడా పొందవచ్చునని వేదోపదేశం. ఈ క్రింది మంత్రాన్ని పరిశీలించండి.

**ఇమౌ తే పక్షావజరౌ పతత్రిణౌ, యాభ్యాం రక్షాంసి**
**అపహం స్యగ్నే । తాభ్యాం పతేమ సుకృతాము లోకం**
**యత్ర ఋషయో జగ్ముః ప్రథమజాః పురాణాః ॥**

– యజుర్వేదం 18-52

ఓ మానవా! నీకున్న రెండు రెక్కలు – జ్ఞాన ప్రయత్నాలు చాలా బలమైనవి. వాటికి ముసలితనం లేదు. పతనం కాకుండా పైపైకి ఎగరటానికి చాలా సహకరిస్తాయి. వాటితో నీలోని కామ క్రోధ లోభ మోహాది రాక్షసులను, బయటి రాక్షసులను (దుష్టులను, శత్రువులను) కూడా అణచిపెట్టగలవు. సుకృతులు – పుణ్యాత్ములు పొందే లోకాలను పొందగలవు. వాటితోనే పూర్వ ఋషులు అమరత్వాన్ని – ముక్తిని కూడా పొందారు. కనుక నీవును నీలోని జ్ఞాన ప్రయత్నాలను బలపరచుకొని ఇహలోక ఉన్నతిని, పరలోక ఉన్నతిని సాధించు. అమరత్వాన్ని కూడా పొంద యత్నించు.

నేటి విజ్ఞానవేత్తలు చేసే ప్రయత్నం కూడా ఇదే. వారు లోక కల్యాణం కొరకు భౌతిక జ్ఞానాన్ని పెంచుకుంటూ పరిశోధనలనే తపస్సు చేస్తున్నారు. మృత్యువును దూరం చెయ్య యత్నిస్తున్నారు. ప్రజల ఇబ్బందులను, కష్టాలను, రోగాలను పోగొట్ట విశేష ప్రయత్నం చేస్తున్నారు. దీనితోపాటు వారు ఆధ్యాత్మిక విద్యను కూడా అభ్యసించి అమరత్వ మార్గాలను అన్వేషిస్తే మరింత మేలు చేసిన వారౌతారు. కనుకనే వేదం భౌతికవిద్య ఎంత అవసరమో ఆధ్యాత్మిక విద్యయు అంతే అవసరమంటున్నది.

## విద్యయా అమృత మశ్నుతే

"ఓ మానవులారా! ఆధ్యాత్మిక విద్యతో అమరత్వాన్ని పొంద విశేషంగా యత్నించండి" అంటున్నది. ఆధ్యాత్మిక విద్య అంటే – ఆత్మ పరమాత్మల యథార్థ జ్ఞానం. నేను, నేను అని వ్యవహరించే మనమంతా ఆత్మలం – జీవాత్మలం. **'న జాయతే మ్రియతే వా కదాచిత్'** అని గీతావచనం (2-20). ఈ ఆత్మ ఒకప్పుడు పుట్టినదికాని, మరణించునదికాని కాదు. మనకు జన్మ మరణాలు లేవు. మనం అవినాశ స్వరూపులం. శరీరంలో ప్రవేశించటాన్ని జన్మగాను, శరీరంనుండి నిష్క్రమించటాన్ని మరణంగాను లోకవ్యవహారముంది అంతే. మానవులమైన మనకు దేవుడు 3 సాధనాలనిచ్చాడు. అవే – త్రికరణాలు – మనో వాక్కాయాలు. వీటితో మనం అభ్యుదయ నిశ్శ్రేయసాలను పొంద తీవ్రంగా యత్నించాలి. ఆ ప్రయత్నంతోపాటు యోగసాధన చేస్తూ అంతర్ముఖులమై మన అసలు స్వరూపాన్ని

సాక్షాత్కారం చేసుకోవటానికి యత్నించాలి. అనంతరం సర్వవ్యాపకుడై, జీవాత్మలమైన మనలోకూడా వ్యాపించియున్న పరమాత్మ తత్త్వాన్ని సాక్షాత్కారం చేసుకోవటానికి భక్తి శ్రద్ధలతో ధ్యానం చెయ్యాలి. సమాధిస్థితిని పొందాలి. అప్పుడు మాత్రమే అమరత్వం ప్రాప్తిస్తుంది. లేకుంటే లేదు. వేదం ఏమంటున్నదో చూడండి.

**వేదాహమేతం పురుషం మహాన్త మాదిత్య వర్ణం తమసః పరస్తాత్ ।**
**తమేవ విదిత్వాతి మృత్యుమేతి**
**నాన్యః పంథా విద్యతేఽ యనాయ ॥**

– యజుర్వేదం 31-18

అజ్ఞానాంధకారానికి ఆవల సహస్రకోటి సమప్రభతో వెలుగొందు మహాన్త పురుషుని – పరమేశ్వరుని దర్శించినవారే ఈ మృత్యురూప సంసార సాగరాన్ని తరించి అమృతత్త్వ ఆనందాన్ని పొందుతారు. అమరత్వ ప్రాప్తికి ఇంతకన్న వేరొక సరళమార్గం లేనేలేదు.

## సృష్టికర్త సందేశం – 9

# దేహావసాన కాలంలో "ఓ3మ్"ను స్మరించు

**వాయు రనిల మమృత మథేదం భస్మాంతం శరీరమ్ ।**
**ఓ3మ్ క్రతో స్మర, క్లిబే స్మర, కృతం స్మర ॥**

– యజుర్వేదం 40-15

హే క్రతో! కర్మశీల మానవా! దేహావసాన సమయంలో నీ శరీరంలోనికి ప్రవహించే వాయువు (ప్రాణము) నిలిచిపోతుంది. అది బాహ్యావాయువులో కలిసిపోతుంది. ఈ శరీరం భస్మంగా మిగిలిపోతుంది. కాని, జీవాత్మవైన నీవు మరణించవు. నీవు అమృతుడవు. కనుక, నీవు సర్వవ్యాపకుడు, సర్వసంరక్షకుడునైన పరమాత్మను ఓ3మ్ నామంతో స్మరించు. ఆత్మజ్ఞాన సామర్థ్యం కొరకు స్మరించు. ప్రార్థించు. ఇంతవరకు ఈ శరీరంతో చేసిన శుభాశుభ కర్మలను స్మరించు. వాటిని ఒకసారి గుర్తు చేసుకో. జరిగిన అశుభకార్యాలకు, పాపాలకు పశ్చాత్తాపపడు. శుభకర్మల ఫలాలను పరమాత్మకు అర్పించు. వాటితో ఏ భౌతిక సుఖాన్ని ఆశించక జన్మరాహిత్యాన్ని – ముక్తిని కోరుకో.

## వాయుః అనిలం అమృతం:

మన శరీరం ప్రాణశక్తి వల్ల జీవిస్తున్నది. మనం పీల్చేగాలిలో ఉండే ప్రాణవాయువును (ఆక్సిజన్‌ను) రక్తం స్వీకరించి శరీరంలోని అన్నిభాగాలకు, అన్ని అవయవాలకు, అన్ని కణాలకు అందజేస్తుంది. ఆ గాలి ఒక్కటే అయినా అది మన శరీరంలో 5 ముఖ్యమైన పనులను, 5 గౌణమైన పనులను చేస్తుంది. అవి చేసే పనులనుబట్టి వాటికి ప్రాణ అపాన వ్యాన ఉదాన సమానములనీ, నాగకూర్మ కృకల దేవదత్త ధనంజయములనీ పేర్లు పెట్టారు. వీటినే శాస్త్రాలలో కొన్నిచోట్ల పంచప్రాణాలనీ, కొన్నిచోట్ల దశప్రాణాలనీ పేర్కొనటం జరిగింది. మృత్యువాసన్నమైనపుడు శ్వాస నిలిచిపోతుంది. క్రమంగా గుండె ఆగిపోతుంది. శరీరంలోని రక్తం ఎక్కడిదక్కడ ఆగిపోతుంది.

ప్రాణవాయువు అందక అవయవాల పనులు నిలిచిపోతాయి. నాడీమండలం పనిచేయదు. కణాలన్నీ చనిపోతాయి. దానితో దుర్గంధం మొదలై పెరిగిపోతూ ఉంటుంది.

సృష్టికర్త సందేశమేమంటే – “ఓ మానవులారా! అవసాన సమయంలో మీ ప్రాణాలు బయట గాలిలో కలిసిపోతాయి. శరీరం మరణిస్తుంది. కాని, జీవాత్మలైన మీరు మరణించరు. మీరు అమృతస్వరూపులు. చావు పుట్టుకలు మీకు లేవు. కనుక, భయపడకండి. నిశ్చింతగా ఉండండి. మీరు చేసుకున్న కర్మలనుబట్టి మీకు మరొక శరీరం లభిస్తుంది. మీరు ఏ శరీరంనుండి ఈ శరీరంలోనికి వచ్చారో మీకు తెలియదు. అట్లే, ఈ శరీరం తదుపరి ఏ శరీరం వస్తుందో కూడా తెలియదు. తెలియకపోవటమే మంచిది. లేకుంటే ఈ జన్మలోని సమస్యలతోనే సతమతమౌతున్న మీకు పూర్వజన్మ సమస్యలు జ్ఞాపకం వస్తూవుంటే మీ కష్టాలు మరింత పెరుగుతాయి. అంతేకాక, చాలా సమస్యలు ఎదురౌతాయి. కనుక, నేనే మీకు పూర్వజన్మ విషయాల మరుపును ప్రసాదించాను. అట్లే, వచ్చే జన్మ ఏదో తెలియకపోవటమే మంచిది. అది కూడా మీకు బాధనే కలిగిస్తుంది.”

కనుక, ఈ శరీరంలో ఏర్పడిన బంధుబాంధవ్యాలపైనా, ఆస్తిపాస్తులపైనా పెంచుకున్న మోహాన్ని విడిచిపెట్టండి. “అయ్యో! ఈ శరీరాన్ని వదిలిపెట్టి వెళ్ళవలసి వస్తున్నది కదా! అని బాధ పడకండి. ముసలిదైన లేదా వ్యాధితో పనికిరాకుండా

పోతున్న శరీరాన్ని విడిచిపెట్టడమే మంచిది. ప్రాతవస్త్రాన్ని విడిచి క్రొత్త వస్త్రాన్ని ధరించబోతున్నారు మీరు. కనుక, ఏ విషయంలోనూ చింతించకండి” అంటున్నాడు.

**అథ ఇదమ్ భస్మాంతం శరీరమ్:**

మరొక సందేశం ఏమంటే – “జీవుడు వదిలివెళ్ళిన శరీరాన్ని – శవాన్ని భస్మంగా అంతం చెయ్యాలి” అని. అలా చెయ్యటమే అన్నివిధాల మంచిది. ఎందుచేతనంటే – ఈ శరీరం పంచభూతాలతో నిర్మితమయ్యింది. మట్టిలోనుండి వచ్చిన ఆహారంతో, త్రాగేనీటితో, పీల్చేగాలితో, సూర్య చంద్రాగ్నులనుండి వచ్చే అగ్నితత్త్వంతో, అన్నిటికి ఆధారమైన ఆకాశతత్త్వంతో ఈ శరీరం పెరిగి పెద్దదయ్యింది. చాలాకాలం వాటిలోనే వాటితోనే జీవించింది. కనుక మరల వాటిని ఆయా తత్త్వాలలో కలిపివెయ్యాలి. అందుకు శవాన్ని దహనం చెయ్యటమే సరియైన, సరళమైన, సత్వరమైన (వేగవంతమైన) పరిష్కారం.

శరీరాన్ని దహనం చేసినపుడు శరీరంలోని నీరు ఆవిరై నీటియావిరిగా గాలిలో కలిసిపోతుంది. వాయుతత్త్వం వాయువులోను అగ్నితత్త్వం అగ్నిలోను కలిసిపోగా ఆకాశతత్త్వం ఆకాశంగా (ఖాళీ స్థలంగా) ఉండిపోతుంది. పృథివీతత్త్వం మాత్రం బూడిదగా మిగిలిపోతుంది. అది కూడా ఆ శ్మశానంలోనే గొయ్యితీసి పాతిపెట్టమని ప్రాచీన శాస్త్రాలు చెబుతాయి. దానిని గంగలో కలుపవలసిన లేదా సమీప నదులలో కలుపవలసిన అవసరం లేదు. ఎవరో కొందరు పురాణాలలో గంగలో కలిపే మూఢనమ్మకాన్ని వ్రాసిపెట్టారు. జీవుని గతి అతను చేసిన కర్మలనుబట్టి ఉంటుందికాని అస్తికలు గంగలో కలిపినంతమాత్రాన స్వర్గం, మోక్షం లభించవు. రామాయణ భారతాది చరిత్ర గ్రంథాలు పరిశీలించండి అస్తికలు గంగలో కలిపిన ప్రసంగం ఎక్కడా కనబడదు. గొప్ప వేద పండితులైన శ్రీ ఆచార్య వినోభాభావే గారు కూడా పృథివీతత్త్వం పృథివిలోనే కలపాలని ఉపదేశించారు. వారు వారి మాతా పితరుల అస్తికలను అట్లే చేశారు.

కొన్ని సాంప్రదాయాలవారు శవాలను పూడ్చిపెట్టి వాటిపై సమాధులు కడతారు. ఇది మంచిదికాదు. అట్టి శవాలు భూమిలో క్రుళ్ళి వర్షాలు పడ్డప్పుడు నీరు వాటిగుండా ప్రవహించి బావులలోను చెరువులలోను కలుస్తుంది. అందువల్ల భూగర్భజలాలు చెడిపోతాయి. స్థలం కూడా చాలా వ్యర్థం అయిపోతుంది. ఈ

సత్యాన్ని గుర్తించియే యూరోపు, అమెరికా దేశాలలో వివేకవంతులు శవాలను దహనం చేస్తున్నారు. ఈ శవదహన ప్రక్రియ విస్తృతంగా వ్యాపిస్తున్నది కూడా.

**'ఓ3మ్ క్రతో స్మర':**

'ఓ క్రతూ! అవసానకాలంలో ఓ3మ్‌ను స్మరించు.' ఈ వేదవాక్యంలో సృష్టికర్త మనను 'ఓ క్రతువా!' అని సంబోధిస్తున్నాడు. 'క్రతో' అంటే 'ఓ కర్మశీలా!' అని అర్థం. పూర్వ పుటలలో తెలిసికొన్నట్లుగా మనం కర్మలు చేయకుండా ఒక్క క్షణం కూడా ఉండలేము.

వాక్కాయాలను బలవంతంగా కట్టిపెట్టినా మనస్సు ఏదో ఒకటి ఆలోచిస్తూనే ఉంటుంది. అందుకునే యాజ్ఞవల్క్య మహర్షి తన శతపథ బ్రాహ్మణం (3-5-3-1)లో **"క్రతుమయః అయం పురుషః"** అన్నారు. ఇంతేగాక, మానవజన్మ ఒక్కటే కర్మయోనియనీ, మిగతా జన్మలన్నీ భోగయోనులనీ ఋషులంటారు. ఈ జన్మలోనే జీవుడు మంచికర్మలు చేసి ఉన్నతిని ఉత్తమగతినీ, చెడుకర్మలు చేసి అవనతిని అధోగతిని (పశు పక్షి క్రిమి కీటకాది జన్మలను) పొందుతాడని ఋషులంటారు. అందుచే మనమంతా క్రతువులం - కర్మలు చేసేవారము.

మరి, 'ఓ3మ్' ఎవరు? 'ఓం' అంటే 'సంరక్షకుడ'దని అర్థం. సృష్టికర్త ఒకే ఒక్కడనీ, అతనికి చాలా గుణాలు, శక్తులు ఉన్నాయనీ, గుణానికి ఒక పేరుగా అతనికి చాలా పేర్లున్నాయనీ పూర్వం తెలుసుకున్నాము కదా! వాటిలో ఏది అసలు పేరు? ఏది ముఖ్యమైనది? అంటే అది ఓం నామమే అన్నారు. ఎందుచేతనంటే - ఓం నామమే సృష్టికర్తకు మనకు గల అసలు సంబంధాన్ని తెలుపుతుంది. అతడు మనకు సంరక్షకుడు (గార్డియన్). మనం అతని రక్షణలో ఉన్నవారం. పిల్లవాడు 'అమ్మా! అమ్మా!' అని పిలుస్తూ పరుగు పరుగున తల్లిని చేరునట్లు మనం 'ఓం ఓం' అని పిలుస్తూ మన సంరక్షకుని చేరుకోవాలి. ఇదే అన్నిటికన్న సరళమైన మార్గమని సమస్త వేదశాస్త్రాలు ఉపనిషత్తులు చెబుతాయి. సమస్త ఋషులు నొక్కి వక్కాణిస్తున్నారు. ఈ ఓం నామ జపంవల్ల, ముఖ్యంగా 'ఓం'ను ప్లుతంగా (దీర్ఘంగా) ఉచ్చరించటంవల్ల భౌతిక ప్రయోజనాలు బోలెడున్నాయి. స్థలాభావం వల్ల ఇచట వ్రాయలేకపోవుచున్నాము. నా రచన 'గాయత్రీ విజ్ఞానం'లో

'ఓ3మ్' ప్రకరణాన్ని చదువగోరుచున్నాము.

**క్లిబేస్మర:**

స్వసామర్థ్యం కొరకు స్మరించు - అంటే, స్వస్వరూప జ్ఞానం బలంగా ఉండటం కొరకు ఓంను స్మరించాలి. మనం ఆత్మస్వరూపులమని శాస్త్రజ్ఞానం వల్ల కలుగుచున్నదేకాని యింకా అనుభవం కాలేదు. ఆత్మ సాక్షాత్కారం కలగలేదు. కనుక ఆ జ్ఞానానికి అంత బలం వుండదు. అది శాబ్దిక జ్ఞానం మాత్రమే. కనుక మనం అత్యంత భక్తితో 'హే పరమేశ్వరా! నాకు ఆత్మబలాన్ని, జ్ఞానబలాన్ని ప్రసాదించు' మని ప్రార్థించాలి.

**కృతం స్మర:**

ఈ శరీరంతో ఇంతవరకు చేసిన కర్మలను తలచుకొని పాపకర్మలకు పశ్చాత్తాపపడాలి. ఇకనుండైనా అట్టి పనులు చేయకూడదని గట్టిగా సంకల్పించుకోవాలి. పుణ్యకర్మలను తలచుకొని మరిన్ని పుణ్యాలు చేయలేకపోయాను కదా! అని భావించాలి. ఆ కొద్దిపాటి పుణ్యకర్మలకు ఏ భౌతిక ప్రయోజనాన్నీ కోరకుండా ఉండటమే మంచిది. దుఃఖాలు దాగివున్న ఈ విషయ సుఖాలవల్ల పెద్ద ప్రయోజనమేముంటుంది? అంతకన్న ఆ సత్కర్మల ఫలాన్ని సృష్టికర్త కర్పించి జన్మరాహిత్యాన్ని ముక్తిని కోరుకోవటం మంచిది.

ఈ వేదమంత్రం యొక్క భావం మీకు బాగా అర్థంకావాలంటే నా రచన "మరణానంతరం జీవుని ప్రయాణం" చదువగోరుచున్నాను.

## సృష్టికర్త సందేశం - 10

# ఓ అంతర్యామీ! ధనప్రాప్తికి మమ్ము ధర్మమార్గమున నడుపుము

**ఓం అగ్నే! నయ సుపథా రాయే అస్మాన్**
**విశ్వాని దేవ వయునాని విద్వాన్ ।**
**యుయో ధ్యస్మ జ్జుహురాణ మేనో**
**భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ ॥** - యజుర్వేదం 40-16

ఓ అగ్నీ! మార్గదర్శక అంతర్యామీ! ధనప్రాప్తికి మమ్ము ధర్మమార్గమున నడుపుము. మనోవాక్కాయాలతో మేము చేసే సమస్త కర్మలు నీవెరుగుదువు. వాటిలో ఏ కుటిల పాప భావనలున్నా వాటన్నిటిని మానుండి దూరము చేయుము. అందుకొరకే మేము నిన్ను మరల మరల వినమ్రముగా ప్రార్థించుచున్నాము.

ఇది ఒక ప్రార్థనా మంత్రం. వేదాలలో పరమేశ్వరుడు మనకు ప్రార్థన ఎలా చెయ్యాలో, వేటికొరకు చెయ్యాలో, వేటికొరకు చేయకూడదో కూడా చెప్పాడు. కేవలం ప్రార్థించటమేకాక అందుకొరకై మనం చెయ్యవలసిన పురుషార్థం (ప్రయత్నం) ఎలా ఉండాలో అదియును చెప్పాడు. ఇట్టి ప్రార్థనా మంత్రాలు వేదాలలో కోకొల్లలు. వాటిలో విద్యా విజ్ఞానాలు దాగి ఉన్నాయి. ఇప్పుడు మనం ఈ మంత్రం ఏమి చెబుతున్నదో జాగ్రత్తగా ఆలోచిద్దాము.

**అగ్నే నయ సుపథా రాయే:**

"ధన మూల మిదం జగత్" అని పెద్దలంటూ వుంటారు. నిజంగా ధనం లేనిది క్షణం గడిచేటట్టు లేదు. ఇచట ధనం అంటే కేవలం రూపాయలేనని కాదు. భూధనం, గోధనం, రాజ్యధనం, కీర్తిధనం, విజయధనం ఇలా చాలారకాల ధనాలుంటాయి. చివరికి భోజనం కూడా ధనమే. వీటిని మనం మనోహరమైన 'లక్ష్మీ' అనే పదంతో వ్యవహరిస్తూ ఉంటాము. భూలక్ష్మి, గోలక్ష్మి, రాజ్యలక్ష్మి, యశోలక్ష్మి, విజయలక్ష్మి, ధాన్యలక్ష్మి అని. ఎంత విరాగికైనా ఆకలికి అన్నం, వంటికి బట్ట అవసరమౌతాయి. అయినా అందరూ విరాగులు కాలేరు కదా! ఇక గృహస్థులకైతే అవసరాలకు అంతే ఉండదు. వారి భార్యాపిల్లలను, వృద్ధులైన తల్లిదండ్రులను, ఆధారపడిన పెద్దలను, ఆశ్రయించుకొని ఉన్న సేవకులను మరియు పశువులను పాలించి పోషించవలసి ఉంటుంది. కనుక వారి కవసరమైన వాటిని సమకూర్చి పెట్టవలసివస్తుంది. బ్రహ్మచర్య వానప్రస్థ సంన్యాసాశ్రమాలలోని వారినీ ఆదరించవలసి ఉంటుంది. ఇవన్నీ ధనంలేకుండా ఎలా సాధ్యం? కనుక గృహస్థులకు ధనం ప్రాథమిక అవసరమౌతుంది.

అందుచేతనే ఆచార్య చాణక్యులవారు తమ 'నీతి సూత్రాలను' **'సుఖస్యమూలం ధర్మః'** అంటూ ప్రారంభించి, వెనువెంటనే రెండవసూత్రంగా **'ధర్మస్యమూలం అర్థః'** అన్నారు. సుఖానికి మూలం ధర్మమే. అందుకు

ఎంతమాత్రం సందేహంలేదు. కాని, ఆ ధర్మాన్ని ఆచరించటానికి అర్థం అవసరమౌతుంది. ఇంతేకాక, ఆత్మోన్నతికిని అర్థం అవసరమే. ధర్మకార్యాలు చేస్తేనే తనకు అభ్యుదయం కలుగుతుంది. ఇహలోక పరలోక ఉన్నతులు కలుగుతాయి. ఈ లోకంలో తనకు, తనవారికి సుఖము, కీర్తి లభిస్తాయి. వచ్చే జన్మ ఇంతకన్న ఉన్నత జన్మ వస్తుంది. అందుచేతనే వేదం **'శతహస్త సమాహర, సహస్రహస్త సంకిర'** - అథర్వవేదం (3-24-5) అంటుంది. అంటే "వందచేతులున్నట్లుగా (వంద విధాలుగా) కష్టపడి న్యాయంగా ధనాన్ని సంపాదించు. ఆ ధనాన్ని వేయి చేతులున్నట్లు వేయి విధాలుగా ధర్మకార్యాలకు వెచ్చించు" అంటుంది.

ఈ యజుర్వేద మంత్రం ఏమంటున్నదంటే - "ఓ మానవులారా! ఒక్కొక్కపుడు ధన సంపాదనకు ఏది ధర్మమార్గమో, ఏది అధర్మ మార్గమో తెలుసుకోలేకపోతారు. మీ అవసరాలు, మీ తొందరలు మీకుంటాయి. కనుక స్వచ్ఛమైన హృదయంతో అంతర్యామినైన నన్ను ప్రార్థించండి. "ఓ అగ్నీ! మార్గదర్శక అంతర్యామీ! ధనప్రాప్తికి ఏది మంచి మార్గమో అది మాకు తెలిపి ఆ మార్గంలో మమ్ము నడిపించు" మని ప్రార్థన చెయ్యండి" అంటున్నది. ఆ విధంగా పవిత్రమైన హృదయంతో ప్రార్థిస్తే తప్పక ఫలితముంటుంది. ఏదైనా చక్కటి ఆలోచన వస్తుంది. మనం ఎంచుకున్నది అధర్మమార్గమైతే అంతర్యామినుండి భయ సంకోచాలు వస్తాయి. ధర్మమార్గమైతే ఉత్సాహ ప్రోత్సాహాలు లభిస్తాయి.

ఈ మంత్రంలో పరమేశ్వరుని 'ఓ అగ్నీ' అని సంబోధించటం జరిగింది. ఇచట అగ్నీ అంటే వంటశాలలో కనబడే భౌతికాగ్ని కాదు. ధాత్వర్థాన్నిబట్టి (అంచు గతి పూజనయోః) గతి కలిగినది, సత్కరించతగినది యని అర్థం. గతిలోనూ 'జ్ఞానం, గమనం, ప్రాప్తి' అనే మూడర్థాలు ఉంటాయంటారు ఋషులు. జ్ఞానంలో పరిపూర్ణుడు, జగత్తునంతటిని గతివంతం చేసేవాడు, ప్రాప్తించ తగినవాడు, సత్కరించ తగినవాడు (ఉపాసించ తగినవాడు) కనుక సర్వాంతర్యామిని 'అగ్నీ' అని పేర్కొనటం జరిగింది. వేదాలలో పరమేశ్వరుణ్ణి 'అగ్ని' నామముతో చెప్పిన సందర్భాలు అనేకం ఉన్నాయి. 'అగ్ని' పదంతోనే వేదం ప్రారంభమౌతుంది. ఋగ్వేదంలోని మొదటి సూక్తమంతా అగ్నినామక పరమేశ్వరుని స్తుతియే. వేదశైలి తెలియని, వ్యాకరణ నిరుక్తాది శాస్త్రాలు చదువని కొంతమంది ఆచార్యులు అగ్ని

పదాన్ని భౌతికాగ్నిగా పేర్కొన్నారు. భౌతికాగ్ని మనకు భౌతికంగా మార్గాన్ని చూపించగలుగుతుందే కాని ధర్మమార్గమేదో ఎట్లు చూపగలుగుతుంది? కనుక, మేము వ్రాసిన 'ఓ మార్గదర్శక! అంతర్యామీ!' అనే అర్థాలే సరియైనవి. "అగ్నిః – అగ్రణీర్ భవతి" అంటుంది నిరుక్తం. అంటే తాను ముందుండి మనకు మార్గం చూపేవాడు అని అర్థం. సమాజ క్షేత్రంలో నాయకుడు, పథ ప్రదర్శకుడు, సేనాపతి, రాజు, ఆచార్యుడు, గురువు మొదలైనవారికి అగ్ని పదం వర్తిస్తుంది (ఆధిభౌతికార్థంలో). ఇక ఆధిదైవికార్థంలో అగ్నిహోత్రానికి, లోకంలో వివిధ రూపాలలో నున్న సామాన్య అగ్నికి వర్తిస్తుంది. ఇక్కడ ఈ మంత్రంలో పరమేశ్వరాగ్నికి – జ్ఞాన స్వరూపుడైన పరమేశ్వరునికి మాత్రమే వర్తిస్తుంది.

**విశ్వాని దేవ వయునాని విద్వాన్:**

వయునములు అంటే జ్ఞానములు, భావములు, ఆలోచనలు నని అర్థం. కర్మలు అనే అర్థం కూడా ఉంది. సృష్టికర్త సర్వవ్యాపకుడు సర్వాంతర్యామీ కనుక అతనికి మన సమస్త ఆలోచనలు, కర్మలు చక్కగా తెలుస్తాయి. ప్రతీ చిన్న ఆలోచనా తెలుసుకోగలడు. వాటిలోని ధర్మాధర్మాలను తెలుసుకోగలడు. వాటిలోని దోషాలను గుర్తించి అవి చేయ నిశ్చయించుకొన్నపుడు మనకు భయ సంకోచాలు కలిగించి హెచ్చరించగలడు. కనుక అతనిపై భారం వెయ్యటమే అన్నివిధాల మంచిది. వేరే గురువులకు, మార్గదర్శకులకు అట్టి శక్తి ఉండదు. అదే మాట తదుపరి వాక్యం చెబుతున్నది.

**యుయోధ్యస్మ జ్జుహురాణమేనః:**

(యుయోధి + అస్మత్ + జుహురాణమ్ + ఏనః) = మాలోని సమస్త కుటిల ఆలోచనలను కర్మలను పాపాచరణలను మానుండి వేరుచేయుము. జుహురాణమ్ అంటే వక్రమార్గం. కుటిలమార్గం. ఏనః అంటే పాపాచరణ. ధనప్రాప్తికి వక్రమార్గాలన్నీ పాపమార్గాలే. సరళమార్గమే సరియైన మార్గం. సత్యమార్గం. కుటిల ఆలోచనలే మనచే పాపాలు చేయిస్తాయి. ఆ పాపాలే మనకు దుఃఖాలను కలిగిస్తాయి. కనుక కార్యరూపం ధరించకముందే కుటిల ఆలోచనలను పోగొట్టుకోవటం మంచిది. అందుకు పరమేశ్వరుని సహాయం కోరటం బాగుపడాలని అనుకునేవారి లక్షణం. అందుచే –

**భూయిష్ఠాం తే నమ ఉక్తిం విధేమ:**

హే అంతర్యామీ! మార్గదర్శకా! అందుకొరకే నేను పలుమార్లు అత్యంత వినమ్రంగా నిన్ను వేడుకుంటున్నాను. ఎవరైతే తాము బాగుపడాలని మనసారా వాంఛిస్తారో ప్రార్థిస్తారో అట్టివారికి అంతర్యామి సాయం తప్పక లభిస్తుంది. క్రమంగా వ్యసనాలు, దురాలోచనలు, దుర్భావాలు, ఇంద్రియలోలతలు శాంతిస్తాయి. జ్ఞానబలం ఆత్మబలం వృద్ధి చెందుతుంది. అంతః శత్రువులైన కామక్రోధాదులు శమిస్తాయి. క్రమంగా అతడు మానవత్వం గల మనిషిగా, దేవతగా మార్పు చెందుతాడు. జన్మ ధన్యమౌతుంది.

అయితే ఆ వినమ్ర ప్రార్థన ఒకటి రెండు పర్యాయాలు చేసి ఫలితం కలగలేదే? అని అనుకోకూడదు. మంత్రంలో 'భూయిష్ఠాం' అనే పదం 'పలుమార్లు – మాటిమాటికి' అని సూచిస్తున్నది. ఎందుచేతనంటే వక్రమార్గంలో తేలికగా డబ్బు సంపాదించటానికి అలవాటుపడిన వ్యక్తి మనస్సు నీతిగా నిజాయితీగా కష్టపడటానికి మనస్సు అంగీకరించదు. పట్టుబడితే పరువుపోతుందనీ, కష్టాలపాలు కావలసివస్తుందని తెలిసినా మనస్సు వక్రమార్గం వైపే మొగ్గుచూపుతూ ఉంటుంది. అందుచే గట్టి ప్రయత్నమే చేయవలసివస్తుంది. 'భూయిష్ఠాం' అని ఉచ్చరించటం చాలా తేలిక. కాని, ఆవిధంగా ఈశ్వరుని శరణాగతి కోరటం కష్టం. 'కోటికోటి ప్రణామము'లనటం చాలా తేలిక. సరియైన పద్ధతిలో కోటి పర్యాయాలు సాష్టాంగ ప్రణామం చెయ్యాలంటే జీవితకాలం సరిపోతుందా? ఏమైనప్పటికీ తాను మంచిగా మారాలనే సంకల్పం బలంగా ఉండాలి. దానితోబాటు మనస్సుతో పోరాడుతూ ఆ మార్గంలో పయనించాలి. అప్పుడే దైవ సహాయం లభిస్తుంది.

వేదాలలో ధనాన్ని గురించి తెలిపే మంత్రాలు అనేకం ఉన్నాయి. వేదం అవినీతితో కూడబెట్టిన ధనాన్ని 'అలక్ష్మీ, పాపీలక్ష్మీ, పతయాలూలక్ష్మీ' అని అంటుంది. "యాజుష్టామా లక్ష్మీః పతయాలూ రజుష్టా అభిచస్కన్దవందనేవ వృక్షమ్ (అథర్వవేదం 7-115-2) అట్టి ధనం, వన్దన తీగ పెరిగి పెరిగి తనకు ఆహారాన్ని, ఆశ్రయాన్ని ఇచ్చిన చెట్టునే నశింపచేయునట్లు వక్రమార్గంలో కూడపెట్టిన వానిని ఆ ధనమే నశింపచేస్తుంది" అంటుంది. కనుక, మిత్రులారా! ధనప్రాప్తికి ధర్మమార్గాన్ని అనుసరించండి.

## సృష్టికర్త సందేశం - 11

# సత్యం హిరణ్మయ పాత్రతో కప్పబడి ఉంది!!!

**ఓం హిరణ్మయేన పాత్రేణ సత్య స్యాపిహితం ముఖమ్,**
**యోఽసా వాదిత్యే పురుషః సోఽసా వహమ్,**
**ఓం ఖం బ్రహ్మ ॥**

- యజుర్వేదం 40-17

"ఓ మానవులారా! సత్యసూర్యుని ముఖం హిరణ్మయ పాత్రతో కప్పబడి ఉంది. ఆకాశంలో అత్యంత జాజ్వలమానంగా ప్రకాశించే సూర్యునిలో వ్యాపకుడనై యున్నది నేనే. సూర్యదేవతకు ఆ ప్రకాశాన్ని ఇచ్చినదియు నేనే. సూర్యునిలో వ్యాపించియున్న నేనే మీలోనూ, సమస్త పదార్థాలలోను వ్యాపించియున్నాను. నా పేరు ఓ3మ్. సర్వాన్ని రక్షించేవాడిని కనుక నా అసలు పేరు ఓ3మ్ మాత్రమే. మిగిలిన పేర్లన్నీ నా గుణకర్మ స్వభావాలను తెలుపుతాయి. నేను 'ఖం'ను. ఆకాశంవలె అన్నిటిలోను వ్యాపించియుంటాను. ఇంతేగాక, నేను 'బ్రహ్మ'ను. అన్నిటికన్న పెద్దవాడను, గొప్పవాడను. సమస్త విశ్వము నాలో ఏకపాదంగా (1/4 వంతుగా) ఉంది. శక్తిసామర్థ్యాలలోను, న్యాయం చేయటంలోను, దుష్టశిక్షణ శిష్టరక్షణ చేయటంలోను నాతో సమానమైనవాడు కాని, నాకన్న గొప్పవాడు కాని మరొకరు లేరు. మిగతా దేవతలన్నీ - పంచభూతాలు, వాటితో ఏర్పడిన మరికొన్ని దేవతలు అన్నీ నా తరువాతనే. ఆ దేవతల నన్నిటిని సృజించినది, వాటికి ఆ శక్తులు ప్రసాదించినదియును నేనే."

ఇది ఈశావాస్య సూక్తంలోని చివరి మంత్రం. యజుర్వేదం ఈ మంత్రంతోనే ముగుస్తుంది. యజుర్వేదం మనకు కర్మకాండను తెలుపుతుంది. ఏ కర్మలను ఆచరిస్తే మనకు విశేష సుఖాలు లభిస్తాయో, ఉన్నతి కలుగుతుందో, అభ్యుదయం సిద్ధిస్తుందో చెబుతుంది. సామాజిక జీవనం చక్కగా గడపటానికి కావలసిన నియమ నిబంధనలను, చేయవలసిన విశేష కార్యాలను చెబుతుంది. వీటితోబాటు నిఃశ్రేయసాన్ని (గొప్పదైన శ్రేయస్సును - ముక్తిని) పొందే విద్యనూ ఉపదేశిస్తుంది. ఆ ఉపదేశమే ఈ చివరి ఈశావాస్య సూక్తం. ముక్తికి ముఖ్యంగా ఆత్మ పరమాత్మలను

గూర్చిన స్పష్టమైన జ్ఞానం ఉండాలి. అనంతరం ఆ జ్ఞానానికి అనుగుణంగా జీవితాన్ని గడపాలి. ఆ విధంగా జీవిస్తూ 'ఉపాసన' అనే కర్మ కూడా చెయ్యాలి. అప్పుడే ఆత్మ పరమాత్మల సాక్షాత్కారం కలుగుతుంది. ముక్తి లభిస్తుంది. వీటినే జ్ఞానకర్మ ఉపాసనలని శాస్త్రాలు పేర్కొంటాయి. సృష్టికర్త ఈ సూక్తంలో ఉపాసనకు అవసరమైన జ్ఞానవిద్యను, అందుకు చేయవలసిన కర్మలను ఉపదేశించాడు. అందుచే ఇది ఉపనిషత్తుగా - ఈశావాస్యోపనిషత్తుగా లోకంలో ప్రాచుర్యం పొందింది. ఇప్పుడు మనం ఈ చివరి మంత్రాన్ని అర్థం చేసుకునే ప్రయత్నం చేద్దాము.

**హిరణ్మయేన పాత్రేణ సత్యస్య + అపిహితమ్ ముఖమ్:**

హిరణ్మయ పాత్రతో సత్యము కప్పబడి ఉంది. అంటే - అవిద్యారూప ప్రకృతి హిరణ్మయపాత్రతో - తన తళుకుబెళుకులతో 'విద్య' యనే సూర్యుని కప్పి ఉంచింది. 'ఓ పరమేశ్వర! ఆ అవిద్యాపాత్రను తొలగించి మాకు సత్యసూర్యుని (విద్యాసూర్యుని) దర్శింపచేయుము" అనే ప్రార్థన ఈ వాక్యంలో నిహితమై ఉంది. లోకంలో ప్రచారంలో ఉన్న ఈశోపనిషత్తులో ఈ మంత్రం కొద్ది మార్పుతో ఈ విధంగా వ్రాయబడి ఉంది.

**"శ్లో॥ హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపిహితం ముఖమ్,**
**తత్త్వం పూషన్ అపావృణు సత్యధర్మాయ దృష్టయే ॥"** (15)

తా॥ సువర్ణమయ - జ్యోతిర్మయ పాత్రతో సత్యం కప్పబడి ఉంది. కనుక, "హే పూషన్! సంపూర్ణ బ్రహ్మాండ పోషకా! ఆ పాత్రను నీవు తొలగించి మాకు సత్యధర్మ దర్శనమును కలిగించుము." అనే ప్రార్థనగా ఉంది.

ఇచ్చట 'సువర్ణమయ పాత్ర' అంటే - ప్రకృతి ప్రలోభాలు - విషయ - సుఖాలు. అవి తమ తళుకుబెళుకులతో మనను ఆకర్షిస్తూ ఉంటాయి. అవి మనను ఆవరించి కప్పి ఉన్నాయి. అందుచే మన సత్యస్వరూపం తెలియటంలేదు. అవిద్యా వశులమై దేహాత్మభ్రాంతితో (దేహమే నేను అనే భావనతో) విత్తేషణ, దారేషణ, లోకేషణ లనే ఈషణ త్రయాలతో పీడింపబడుతూ ఉన్నాము. వాటిని సాధించటమే పరమ పురుషార్థంగా ప్రవర్తిస్తున్నాము. ఈ అవిద్య చాలా బలమైనది. అది తొలగాలంటే మనం పూర్ణ పురుషార్థం చేస్తూ పరమేశ్వర సహాయాన్ని అర్థించాలి.

ఆయన అనుగ్రహం లేనిది అవిద్య తొలగటం కష్టమే. కనుక ఆత్మోన్నతికి జ్ఞానభక్తి చాలా అవసరం.

మహర్షి దయానందులవారు తమ అగాధ వ్యాకరణ జ్ఞానంతో ఈ వేద వాక్యానికి "జ్యోతిర్మయేన, రక్షకేన అవినాశినః యథార్థస్య కారణస్య ఆచ్ఛాదితమ్ ముఖమ్ – జ్యోతి స్వరూపుడను, రక్షకుడను అగు నాచే నాశరహితమగు యథార్థ కారణము యొక్క కప్పబడియున్న ముఖతుల్యమగు ఉత్తమాంగము ప్రకటము చేయబడు"నని అర్థం వ్రాశారు. ఏలనంటే బ్రాహ్మణ గ్రంథాలలో 'హిరణ్యం వై జ్యోతిః – హిరణ్యం అంటే జ్యోతి' అని వ్యాఖ్యానించబడింది. 'పాత్రేణ' అనే పదం 'పా–రక్షణే' అనే ధాతువుతో సిద్ధిస్తుంది. కనుక మహర్షి ఆవిధంగా రక్షకుడని అర్థం వ్రాశారు. వారి వ్యాకరణ జ్ఞానం చాలా లోతైనది.

**యోऽసా వాదిత్యే పురుషః సోऽసా వహమ్**

(యః + అసౌ + ఆదిత్యే పురుషః సః + అసౌ + అహమ్) – ఈ ప్రత్యక్ష సూర్యుని యందు ఏ పురుషోత్తముడు వ్యాపించియున్నాడో అతడిని నేనే.

పరమేశ్వరుడు సర్వవ్యాపకుడు కనుక సూర్యచంద్ర నక్షత్రాలలో వ్యాపించి ఉన్నట్లే ప్రతీ ప్రాణిలోనూ అతడు వ్యాపించి ఉన్నాడు. బ్రహ్మాండంలో ఉన్నవాడే పిండాండంలోనూ ఉన్నాడు. జీవాత్మలమైన మనలోనూ వ్యాపించి ఉన్నాడు. కనుక, మనలో ఉన్న పరమాత్మను దర్శించ ఉపాసన చేయుదము రండు.

**ఓ3మ్ ఖం బ్రహ్మ:**

ఓ3మ్ నామకుడనైన నేను ఖం – ఆకాశంవలె ప్రపంచ పదార్థాలన్నింటిలో వ్యాపించి ఉన్నాను. నేను బ్రహ్మను. అన్నిటికన్న పెద్దవాడను, గొప్పవాడను. కనుక మీరంతా నన్నే ఉపాసించండి. సమస్త దుఃఖాలనుండి విముక్తిని పొంది నా తృతీయధామంలో – ఆనందధామంలో స్వేచ్ఛగా విహరించండి.

ఈ చివరి 3 పదములు చాలా విశిష్టమైనవి. ఈ సూక్తంలో ఓ3మ్ పదము రెండు పర్యాయాలు ప్లుతయుక్తంగా చెప్పబడింది. 'ప్లుతం' అంటే మొదటి ఓ అనే అక్షరాన్ని దీర్ఘంగా – 3 అక్షరాలు పలికేటంత సమయం పలకాలి. అంతేకాక, దానిని భక్తిశ్రద్ధలతో ప్రేమతో మనోహరంగా పలకాలి. అప్పుడు మన శరీరంలోను, మనస్సులోను, ఆత్మలోను అద్భుతమైన స్వాగతించదగిన మార్పులు కలుగుతాయి. 3 సంవత్సరాల క్రిందట ఒక దినపత్రికలో 'ఓంకార నాద కుటీరం' అనే శీర్షికతో ఒక పత్రికా విలేఖరి ఒక ఆశ్చర్యకరమైన వ్యాసం వ్రాశారు. వారు మహారాష్ట్రలోని

అహ్మద్‌నగర్ సమీపంలోగల (పూనే నుండి 117 కి.మీ. దూరంలో గల) ఓంకారనాద కుటీరంలో తాను 5 రోజుల శిక్షణ శిబిరంలో పాల్గొని పొందిన దివ్యమైన అనుభూతులను వ్రాశారు. వారికి, వారి సహచరులకు చక్కటి ఆరోగ్యం, ఆనందం, ప్రశాంతత, దివ్యమైన అనుభూతి కలిగినవన్నారు. అక్కడ ఓంకార నాదంపై చాలా పరిశోధనలు జరుగుచున్నవట. ఇట్టి అనుభవాలను మేము చాలానే విన్నాము. చదివాము. ఓ3మ్ పదము చాలా విశిష్టమైనది.

ఇక రెండవది ఖం. ఖం అంటే ఆకాశమని సామాన్యార్థం. పరమేశ్వరుని వ్యాపకత్వానికి ఉపమానంగా ఆకాశాన్ని పేర్కొనటం మన శాస్త్రాలలో అక్కడక్కడ కనబడుతుంది. ఆకాశతత్త్వం ప్రపంచ పదార్థాలన్నిటిలోను వ్యాపించి ఉంది. ఎట్లంటే పదార్థాలన్నీ అణువుల సంఘాతాలనీ – సమూహాలనీ విజ్ఞానశాస్త్రం చెబుతుంది. అణువులలో కేంద్రకంలోని ప్రోటాన్ న్యూట్రాన్‌ల చుట్టూ ఎలక్ట్రాన్‌లు తిరుగుతూ ఉంటాయట. సూర్యునిచుట్టూ వివిధ గ్రహాలు ఒకదానితో ఒకటి ఢీ కొట్టకుండా వాటివాటి కక్షలలో తిరుగుచున్నట్లే అణుగర్భంలో ఎలక్ట్రానుల భ్రమణం ఉంటుందట. అవి భ్రమణం చేస్తున్నాయంటే అణువులో కొంత ఖాళీ (Space) ఉన్నట్లే కదా! ఆ ఖాళీనే మన ఋషులు ఆకాశతత్త్వమన్నారు. ఇచ్చట ఖాళీ అంటే అసలు ఏమీలేదు శూన్యమని కాదు. గమనా గమనాలకు అవకాశమిచ్చే ఒక పదార్థమని కణాద మహర్షి అంటారు. వారు తమ వైశేషిక దర్శనంలో **“నిష్క్రమణం ప్రవేశన మితి ఆకాశ లింగమ్”** (2–1–20) అని ఒక సూత్రంగా నిర్వచించారు. అటువంటి పదార్థం ఒకటున్నదని తర్కబద్ధంగా (హేతుబద్ధంగా), వైజ్ఞానికంగా నిరూపించారు. అది శబ్ద గుణాన్ని కలిగివున్నదన్నారు. వివరంగా తెలిసికోగోరువారు వైశేషిక దర్శనంలో ఆకాశ ప్రకరణం చదువగోరుచున్నాము.

మూడవ పదం బ్రహ్మ. బ్రహ్మ అంటే అన్నిటికన్న గొప్పదని, పెద్దదని అర్థం. పదార్థాలు కొన్ని ఉన్నప్పుడే వాటిలో ఎవరు గొప్ప, ఎవరు పెద్ద అనే ప్రసక్తి ఉంటుంది. ఇక్కడ పరమేశ్వరుని ‘బ్రహ్మ’ అంటున్నామంటే – కోటానుకోట్ల జీవులకన్న, కోటానుకోట్ల జడ పరమాణువుల కన్న గొప్పవాడని అర్థం చేసుకోవాలి. జీవుల, పరమాణువుల పరిమాణాలు చాలా చిన్నవి. వీటన్నిటిని తన గర్భంలో కలిగి ఉన్నాడు కనుక పరిమాణంలోను, జ్ఞానంలోను, శక్తి సామర్థ్యాలలోను అన్నిటికన్న పెద్దవాడు అని అర్థం. స్థలాభావం వల్ల ఈ విషయాన్ని సంక్షిప్తంగా వ్రాయవలసి వచ్చింది.

# ఈశావాస్యోపనిషత్తు

**ఈశావాస్యమిదం సర్వం యత్కించ చ జగత్యాం జగత్ ।**
**తేన త్యక్తేన భుంజీథా మా గృధః కస్య స్విద్ధనమ్ ॥** 1

- యజు. 40-1

By one Supreme Ruler is this universe pervaded, even every world in the whole circle of Nature. Enjoy pure delight, O man, by abandoning all thoughts of this perishable world, and covet not the wealth of any creature existing.

**కుర్వన్నే వేహ కర్మాణి జిజీవిషేచ్ఛతగం సమాః ।**
**ఏవం త్వయి నాన్యథేఽతోస్తి న కర్మ లిప్యతే నరే ॥**

- యజు. 40-2

Aspire, then, O man, to live by virtuous deeds, for a hundred years, in peace with thy neighbours. Thus alone, and not otherwise, will thy deeds not influence thee.

**అసుర్యా నామ తే లోకాఽఅన్ధేన తమసావృతాః ।**
**తాంస్తే ప్రేత్యాపి గచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః ॥**

- యజు. 40-3

To those regions where evil spirits dwell and utter darkness prevails, surely go, after death, all such men as destroy the purity of their own souls.

**అనేజదేకం మనసో జవీయో నైనద్దేవాఽ ఆప్నువన్ పూర్వమర్శత్ ।**
**తద్ధావతోఽ న్యానత్యేతి తిష్ఠత్తస్మిన్నపో మాతరిశ్వా దధాతి ॥**

- యజు. 40-4

There is one unchanheable, eternal, intelligent Spirit, even more vigorous then mind. Material senses cannot perceive Him. Therefore, the sage withdraws his senses from their natural course and perceives the Supreme Being everywhere present.

తదేజతి తన్నైజతి తద్దూరే తద్వన్తికే ।
తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః ॥

– యజు. 40–5

He moves all, but Himself does not move. To the ignorant He is far, but to the wise He is at hand. He pervades inside and outside of all.

యస్తు సర్వాణి భూతాన్యాత్మన్నేవాను పశ్యతి ।
సర్వభూతేషు చాత్మానం తతో న వి చికిత్సతి ॥

– యజు. 40–6

He who considers all being as existing in the Supreme Spirit, and the Supreme Spirit as pervading all beings, cannot view with contempt any creature whatsoever.

యస్మిన్సర్వాణి భూతాన్యాత్మైవా భూద్విజానతః ।
తత్ర కో మోహః కః శోకఽ ఏకత్వ మనుపశ్యతః ॥

– యజు. 40–7

How can joy and sorrow overtake him who, through wisdom, perceives the Unitary Spirit as dwelling in all beings.

స పర్యగాచ్ఛుక్రమకాయ మవ్రణ మస్నావిరగం శుద్ధమపాప విద్ధమ్ ।
కవిర్మనీషీ పరిభూః స్వయంభూర్ యాథాతథ్యతోఽర్థాన్ వ్యదధాత్ శాశ్వతీభ్యః సమాభ్యః ॥

– యజు. 40–8

He overspreads all creatures. He is entirely Spirit without the form either of a minute body, or an extended one, which is liable to impression or organisation. He is the ruler of the intellect, self-existent, pure, perfect, omniscient and omnipresent. He has from all eternity been assigning to all creatures their respective purposes.

అన్ధం తమః ప్రవిశన్తి యే ఽ సంభూతి ముపాసతే ।
తతో భూయఽ ఇవతే తమో య ఽ ఉ సమ్భూత్యా రతాః ॥

– యజు. 40–9

Miserable are they, who worship atoms as the efficient cause of the world; but far more miserable are they, who worship the visible things made of atoms.

**అన్యదేవాహుః సమ్భవాదన్య దాహురసమ్భవాత్ ।**
**ఇతి శుశ్రుమ ధీరాణాం యే నస్తద్విచ చక్షిరే ॥**

– యజు. 40–10

Saints, wise and firm assure us that the worship of atoms leads to one result, and that of things visible to the reverse.

**సమ్భూతిం చ వినాశం చ యస్తద్వేదో భయగం సహ ।**
**వినాశేన మృత్యుం తీర్త్వా సమ్భూత్యా మృతమశ్నుతే ॥**

– యజు. 40–11

He, who realize both, enjoys, after death which is the consequence of the worship of things visible, immortality, the friut of the realization of Divine power displayed in atoms.

**అన్ధం తమః ప్రవిశన్తి యే ఽ విద్యా ముపాసతే ।**
**తతో భూయఽ ఇవ తే తమో యఽ ఉ విద్యాయాం రతాః ॥**

– యజు. 40–12

Miserable are they who worship ignorance; but far more miserable are they who arrogantly presume knowledge.

**అన్య దేవా హుర్విద్యాయాఽ అన్య దాహురవిద్యాయాః ।**
**ఇతి శుశ్రుమ ధీరాణాం యే నస్తద్విచ చక్షిరే ॥**

– యజు. 40–13

Saints, wise and firm, assure us that ignorance, the life of senses, produces one result; and knowledge, the life of spirit, produces exactly the reverse.

**విద్యాం చా విద్యాం చ యాస్తద్వేదో భయగం సహ ।**
**అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయామృత మశ్నుతే ॥**

– యజు. 40–14

He, who realizes both, passes through physical disselution by virtue of the life of sense, and enters into immortality by virtue of the life of spirit.

**వాయురనిల మమృతమథేదం భస్మాన్తగం శరీరమ్ ।**
**ఓ3మ్ క్రతో స్మర క్లిబే స్మర కృతం స్మర ॥**

- యజు. 40-15

The air shall sustain the immortal spiritual body, the gross one shall only last till cremation. O thou ! who hast sown the seed of deeds, remember that the same thou shall reap.

**అగ్నే నయ సుపథా రాయేఽ అస్మాన్విశ్వాని దేవ వయునాని విద్వాన్।**
**యుయోధ్యస్మజ్జుహురాణమేనో భూయిష్ఠాం తే నమఽ ఉక్తిం విధేమ॥**

- యజు. 40-16

O All-wise Being! Thou art the source of knowledge. Inspire us with thy wisdom, lead us to rectitude, and drive off our evil. To this end, we repeatedly praise Thee and adore.

**హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి హితం ముఖమ్ ।**
**యోఽ సావిదిత్యే పురుషః సోఽసావహమ్ ।**
**ఓం ఖం బ్రహ్మ ॥**

- యజు. 40-17

O man by me the Resplendent protector, is covered the face of Eternal cause, the matter. Ths Spirit younder in the Sun, that spirit dwelling there am I. I am vast like the atmosphere. Creator of all in merit, action, and nature am I. Can is my name?

# వైదిక ప్రార్థన

స నః పితేవ సూనవేఽగ్నే సూపాయనో భవ ।
సచస్వా నః స్వస్తయే ॥ - ఋగ్. 1-1-9

O' Lord, Thou art to us as a father is to his son. Many we attain Thee. O' Illuminator (Agni), and may Thou shower happiness on us.

దేవో దేవానామసి మిత్రో అద్భుతో వసుర్వసూనామసి చారురధ్వరే ।
శర్మన్త్స్యామ త్వ ప్రథస్తమేఽగ్నే సఖ్యే మా రిషామా వయం తవ ॥
- ఋగ్. 1-94-13

Thou art of gods, a wonderful friends, life of all lives, beautiful in this cosmic sacrifice. O' God (Agni), may we live peacefully under Thy extensive protection and may we, under Thy friendship, never come to grief.

ఉపచ్ఛాయామివ ఘృణేరగన్మ శర్మతే వయం ।
అగ్నే హిరణ్యఽసంద్రృశః ॥ - ఋగ్. 6-16-38

O' God (Agni), thou art shining like gold. We approach Thy shelter as we approach a shady when tormented with heat.

అభూరేకో అయిపతే రయీణామా హస్తయోరధియా ఇంద్ర కృష్టీః ।
వి తోకే అప్సుతనయే చ సూరేఽచింత చర్షణాయో వివాచః ॥
- ఋగ్. 6-31-1

Alone art Thou lord of all riches and wealth. The protection of the people lies in Thy hands. Men invoke Thee with loud voices for rain, sunlight and progeny.

త్రాతారమింద్రమవితార మింద్రం హవేహవే సుహవం శూరమింద్రమ్।
హ్వాయామి శక్ర పురుహూత మింద్రం స్వస్తినో మఘవా ధాత్వింద్రః ॥
- ఋగ్. 6-47-11

I invoke God the Mighty, God the Saviour, God the Rescuer, God the Powerful, God the much invoked, who is reverentially invoked at every invocation. May the Bounteous God shower His bless-

ings on us.

**త్వం వర్మాసి సప్రథః పురోయోధశ్చ వృత్రహన్ ।**
**త్వయా ప్రతి బ్రువే యుజా ॥** – ఋగ్. 7-31-6

O' Champion and Destroyer of enemies, Thou art my coat-of-mail. Thine protection is extensive; with Thee as my friend I defy my opponents.

**వయం ఘా తా త్వే ఇదింద్ర విప్రా అపి ష్మసి ।**
**నహి త్వదంత్య పురుహూత కశ్చన మఘవన్నస్తిమండితా ॥**
– ఋగ్. 8-66-13

Verily O' God (Indra) we are Thine : the learned depend on Thee. O much-invoked, there is none except Thee who can make us happy.

**ఇంద్ర శుద్ధో న ఆ గహి శుద్ధః శుద్ధాభిరూతిభిః ।**
**శుద్ధోరయం ని ధారయ శుద్ధో మమిద్ధి సోమ్య ॥**
– ఋగ్. 8-95-8

Thou art pure, O' God (Indra)! Come to us with Thy perfect protection. Being pure Thyself, sustain us with pure (honestly earned) riches. O' Peaceful, purify my intellect.

**త్వం హి నః పితా వసో త్వం మాతా శతక్రతో బభూవిథ ।**
**అధా తే సుమ్నమీమహే ॥**
– ఋగ్. 8-38-11

O' Ompipresent God, Thou art our Father and Thou art our Mother. Thou wert so even at the time of the creation. Thou art performer of innumerable sacrifices. We pray unto Thee for Thy good wishe.

**త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టివర్ధనమ్ ।**
**ఉర్వారుకమివ బంధనాన్ మృత్యోర్ముక్షీయ మా మృతాత్ ॥**
– ఋగ్. 3-60 (1)

O' Lord of transcendental vision, we worship Thee, Who art

source of sweet smell and strength. May Thou free us from life's bondage (as painlessly) as a ripe cucumber is released from its stalk. May we be not deprived of immortality.

**దృతే దృంహ మా మిత్రస్య మా చక్షుషా సర్వాణి భూతాని**
**సమీక్షంతామ్ । మిత్రస్యాహం చక్షుషా సర్వాణి భూతాని**
**సమీక్షే । మిత్రస్య చక్షుషా సమీక్షామహే ॥**

– యజు. 16-18

O' God, dispeller of ignorance, grant me strength. May all the beings look upon me with the eye of a friend. May I (also) look upon all the beings with the eye of a friend. Let us all regard one another with the eye of a friend.

**త్వం నో అగ్నే మహోభిః పాహి విశ్వస్యా అరాతేః ।**
**ఉత ద్విషో మర్త్యస్య ॥** – సామ. 1-1-1-6

O' God (Agni), by Thy mighty aids save us from all the enemies and from all those who hate mankind.

**అగ్నే వివస్వదా భరాస్మభ్యమూతయే మహే ।**
**దేవో హ్యసి నో దృశే ॥** – సామ. 1-1-1-10

O' God (Agni), fill us with radiant light for our great protection. Thou art refulgent and with Thine light we perceive (and realize truth).

**అధ్యాఽద్యా శ్వః శ్వ ఇంద్ర త్రాస్వ పరే చనః ।**
**విశ్వా చ నో జరిత్వన్త్ సత్పతే అహా దివా నక్తం చ రక్షిషః ॥**

– సామ. 2-1456

O' God (Indra), protect us today, tomorrow, thereafter and everyday. O' Protector of the good, protect us - Thy worshippers - during day and night.

**ఆ నో అగ్నే సుచేతునా రయిం విశ్వాయుపోషసమ్ ।**
**మార్డోకం ధేహి జీవసే ॥** – సామ. 2-1524

O' God (Agni), grant us, for our welfare and existance, wealth and riches which are means of sustenance.

**ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృళయ ।**
**త్వామవస్యురాచకే ॥** - సామ. 1-1583

O' God (Varun), hear my prayer and bless me with happiness. I adore thee for obtaining Thy protection.

**యో భూతం చ భవ్యం చ సర్వం యశ్చాధితిష్ఠతి ।**
**స్వర్యస్య చ కేవలం తస్మై జ్యేష్ఠాయ బ్రహ్మణే నమః ॥**
- అథర్వ. 10-8-1

Saluations unto God, the most exalted, Who rules the past, the present and the future, Who controls the entire universe and alone is the Lord of all.

O LORD !

Whatever way we turn, O Lord, we find
Thy ever-present rays that indicate
And point to where Thy glorious Self doth shine.
Revealing the form of the universe.

* * *

The universe and what goes on therein
From immemorial time are verily
One endless hymn of praise to Thee, my Lord,
And for approch to Thee but an attempt
In various ways that are open to man.

- ఋగ్. 1-50-10

O GOD !

Life-giving power Thou behind us all
Thou, the allayer of all miseries,
Thou art the source of happiness and bliss,
And Thou verily great in all respects,
And the creator of the universe.
Thy laws are ever-active, never change.
And Thou art, O my Lord, truth incarnate.

* * *

When in the great infinity we delve,
The realisation of the immensity
And the mightly upsurge of creation
Flashes upon the screen of the mind's eye.
A glimpse, a vision of the eternal law
Will drive away all evil, and will check
The base and purile tendencies of life.

# ఆర్యసమాజ నియమములు (పది)

1. సమస్త సత్యవిద్యలకును విద్యవలన నెఱుంగబడు పదార్థములకును ఆదిమూలము పరమేశ్వరుడు.
2. ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాళువు, ఆజన్ముడు, అనాది, అనంతుడు, నిర్వికారుడు, అనుపముడు, సర్వాధారుడు, సర్వేశ్వరుడు, సర్వవ్యాపకుడు, సర్వాంతర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయునై ఉన్నాడు. అతనినే ఉపాసించుట యోగ్యము.
3. వేదము సమస్త సత్యవిద్యల గ్రంథము వేదమును చదువుట, చదివించుట, వినుట, వినిపించుట ఆర్యులందరికి పరమ ధర్మము.
4. సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించుటకును, ఎల్లప్పుడు సిద్ధముగా ఉండవలయును.
5. అన్నిపనులు ధర్మానుసారముగ అనగా సత్యాసత్యములను విచారించి చేయవలయును.
6. సంసారమునకు ఉపకారమొనర్చుట, ఈ సమాజము యొక్క ముఖ్యోద్దేశ్యము. అనగా శారీరకోన్నతికి, ఆత్మోన్నతికి, సామాజికోన్నతికి పాటుపడవలయును.
7. అందరితో ప్రీతి పూర్వకముగ, ధర్మానుసారము యథాయోగ్యముగ వర్తించవలయును.
8. అవిద్యను నశింపజేసి విద్యను పెంపొందింపజేయవలయును.
9. ప్రతివ్యక్తియు తన యున్నతితోనే సంతృప్తినొందక అందరి యున్నతిలోనే తన యున్నతి కలదని తలంపవలయును.
10. సమస్త మానవులు సర్వహితకరములగు సామాజిక నియమములను పాలించుటలో పరతంత్రులై సర్వహితకరములగు నియమములందు స్వతంత్రులగుట అందరికి తగును.

# ముగింపు మాటలు

కర్మకాండను బోధించే యజుర్వేదం యజ్ఞప్రశంసతో ప్రారంభమై ఈ బ్రహ్మవిద్యోపదేశంతో ముగుస్తుంది. కనుకనే మన ఋషులు ఈ ఈశావాస్య సూక్తాన్ని ఉపనిషత్తులలో మొదటి ఉపనిషత్తుగా పేర్కొన్నారు. ఇది ఈశ్వరీయ ఉ పనిషత్తు కనుక దీనికి మొదటిస్థానం ఇచ్చారు. ఉపనిషత్ కర్తలైన ఋషులకు ప్రాథమిక జ్ఞానాన్ని, ప్రేరణను కలిగించినది ఇదే కదా!

నేడు లోకంలో 200 వరకు ఉపనిషత్తు లున్నాయంటున్నారు. వీటిలో 108 ఉపనిషత్తులు ఎక్కువ ప్రాచుర్యాన్ని పొందాయి. వీటిలోనుండి కేవలం 10 ఉపనిషత్తులనే శంకర, రామానుజ, మధ్వాచార్యులు ప్రామాణికంగా తీసుకొని వారివారి అద్వైత విశిష్టాద్వైత ద్వైత వాదాలను ప్రతిపాదించ యత్నించారు. కాని, ఈ మూడు వాదాలు వేదాల అసలు వాదాన్ని స్పష్టం చెయ్యలేకపోయాయి. ఇంతేగాక, వారి వాదాలలో కొన్ని వాదాలు – ఆలోచనలు వేదాలకు అనుకూలంగాను, మరికొన్ని ప్రతికూలంగాను ఉన్నాయి. కనీసం ఆ మూడిటిలోను సమన్వయం కూడా లేదు. అనంతరం వచ్చిన మహర్షి దయానందులవారు మాత్రమే వేదం ప్రతిపాదించే బ్రహ్మవిద్యను స్పష్టంగాను, హేతుబద్ధంగాను, వైజ్ఞానికంగాను, ప్రాచీన ఋషుల వేద వ్యాఖ్యానాలకు అనుకూలంగాను ప్రతిపాదించారు. ముఖ్యంగా తమ జగత్ప్రసిద్ధమైన 'సత్యార్థ ప్రకాశం' అను గ్రంథంలో చక్కగా వివరంగా సమీక్షించారు. దానిని మనం త్రైతవాదం అనవచ్చు.

త్రైతవాదం అంటే – సృష్టి, స్థితి, ప్రళయకర్తయైన దేవుడు అనాదియైనట్లే జీవులు, ప్రకృతి కూడా అనాదులే. ఈ మూడిటికి ఆది అంతములు లేవు. కాకపోతే వీటిలో ప్రకృతి జడ పదార్థం. అంటే – జ్ఞానంలేని, సుఖదుఃఖాల అనుభవంలేని తనంతతానుగా జగత్తుగా పరిణమించలేని పదార్థం. జీవులకు జ్ఞానం ఉంది కాని అది అతి స్వల్పం. శక్తి సామర్థ్యాలు కూడా స్వల్పమే. మూల ప్రకృతిని సృష్టిగాను అనంతరం ప్రళయంగాను చేయగల జ్ఞానం, శక్తి సామర్థ్యాలు కేవలం దేవునికి మాత్రమే ఉన్నాయి. ఈ సృష్టి మిథ్యకాదు. అనిత్యం అనవచ్చు. ఎప్పుడూ ఇలాగే ఉండదు. నిరంతరం పరిణామం (మార్పు) చెందుతూ ఉంటుంది. అదియు చాలా నియమబద్ధంగా జరుగుతుంది. ఆ పరిణామానికి మూలకారణం పరమేశ్వరుడే. అట్టి ఈశుడు – నియామకుడు సర్వవ్యాపకుడంటుంది ఈ సూక్తం.

**"ఈశావాస్య మిదం సర్వమ్ యత్కించ జగత్యాం జగత్"** అంటుంది. ఇక జీవులను గురించి ఆలోచిద్దాము.

జీవులు దేవుని అంశలు (ముక్కలు) కాదు. అవి ప్రత్యేక సత్తా (ఉనికి) కలిగినవి. వాటికి సుఖాలను, కర్మఫలాలను ఇవ్వటం కొరకే దేవుడు సృష్టి ప్రళయాలు చేస్తూ ఉంటాడు. జీవులకు వారి వారి కర్మలనుబట్టి ఆయా శరీరాలను నిర్మించి ఇస్తూ ఉంటాడు. సుఖదుఃఖ భోగాలను ఇస్తూ ఉంటాడు. విశేషంగా మానవ శరీరం ఒక ప్రక్క ప్రారబ్ధం అనుభవిస్తూనే ఉన్నతి కొరకు యత్నించగల **'కర్మయోని'**. విశేష ప్రయత్నం చేస్తూ మానవుడు తన జ్ఞానాన్ని పెంచుకుంటూ ఈ లోకంలో భౌతిక సామాజిక ఆత్మిక ఉన్నతులను పొందగలుగుతాడు. పరోపకారాది పుణ్యకర్మలు చేసి వచ్చే జన్మను ఇంతకన్న ఉన్నత జన్మగా చేసుకోగలుగుతాడు. దీనినే అభ్యుదయం అంటాయి శాస్త్రాలు. ఇంతేగాక, వివేకవంతుడైన మానవుడు ప్రాపంచిక సుఖాలలోని నిస్సారతను, క్షణికతను గుర్తించి నిశ్శ్రేయసతను - సర్వదుఃఖ నివృత్తిని పొంద సాధన చేయగలుగుతాడు. సదా సత్కర్మల నాచరిస్తూ గీతాచార్యులు చెప్పినట్లు ఆ కర్మల ఫలాలను ఈశ్వరార్పణ చేస్తూ కర్మబంధనాల నుండి విడివడగలుగుతాడు. పరాంతకాలం వరకు పరమానందాన్ని అనుభవించగలుగుతాడు. దీనినే ముక్తి అంటాయి శాస్త్రాలు.

అట్టి అభ్యుదయ నిశ్శ్రేయసాలను పొందటానికి ఈ ఈశావాస్య సూక్తం కర్మయోగాన్ని ప్రతిపాదిస్తుంది. ఆ కర్మయోగాన్ని యోగేశ్వరుడు శ్రీకృష్ణుడు గీతలో వివరించాడు. కాని, మధ్యకాలంలో అన్ని గ్రంథాలలోను ప్రక్షిప్తాలు (చేర్పులు) జరిగినట్లే భగవద్గీతలోనూ ప్రక్షిప్తాలు జరిగాయి. కొందరు ఆర్య విద్వాంసులు వేదాల వెలుగులో ఆ ప్రక్షిప్తాలను తొలగించి విశుద్ధ భగవద్గీతను రూపొందించారు. అవి అన్ని ఆర్యసమాజ మందిరాలలోను లభిస్తాయి. దానిని ఈ ఈశావాస్య సూక్తానికి అనుగుణంగా మనన చింతనలు చేస్తే విషయాలు మరింత విశదమౌతాయి. పయనించవలసిన మార్గం ప్రస్ఫుటమౌతుంది. తేటతెల్లమౌతుంది.

శమ్ ఇతి ఓ3మ్



# ప్రార్థన

హిరణ్యగర్భః ఋషిః ప్రజాపతిః దేవతా

**ఓం హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతిరేక ఆసీత్ ।
స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ ॥**

– యజుర్వేదం 13–4

(హిరణ్యం వై జ్యోతిః – శతపథ బ్రాహ్మణం)

సృష్టి ఏర్పడకపూర్వం సూర్య నక్షత్రాది జ్యోతిర్మయ పదార్థాలను తన గర్భమున కలిగిన పరమాత్మ సమస్త పదార్థాలను ఎవరి సహాయం లేకుండా తానొక్కడే సృజించి పాలించుచున్నాడు. అతని ఆధారంతోనే ఈ పృథివీ ద్యులోకాలు వాటివాటి మార్గాలలో పరిభ్రమించుచున్నవి.

అట్టి ఆనంద స్వరూప విశ్వాత్మకు (అంతరాత్మకు) మా సత్కర్మలను హవిస్సుగా (ఆహుతిగా) అర్పించి అత్యంత విధేయతతో నమస్కరించుచున్నాము.

May we apply ourselves with abounding love and concentration to the devotion of Him, who is self-effulgent creator and supporter of the Sun, Stars and other planets, who existed before creation, as the one master of the entire universe, supporter and regulator of the all solar systems.



# సృష్టికర్త స్వరూపం

ఆత్మా దేవతా

విరాట్ త్రిష్టుప్
ఛందః

**ఓం అకామో ధీరో అమృతః స్వయంభూః**
**రసేన తృప్తో న కుతశ్చ నోనః ।**
**తమేవ విద్వాన్ న భిభాయ మృత్యోః**
**ఆత్మానం ధీర మజరం యువానమ్ ॥**

– అథర్వవేదం 10–8–44

సృష్టి స్థితి లయ కర్తయైన ఏకేశ్వరుడు అకాముడు (ఏ ప్రాపంచిక విషయ కోరికలు లేనివాడు). ధీరుడు (అత్యంత ధైర్యవంతుడు). అమృతుడు – మరణం లేనివాడు. స్వయంభువుడు – స్వయంగా ఉండువాడు (అతని ఉనికికి మరొక కారణం లేనివాడు). రసంతో తృప్తుడు – బలవీర్య పరాక్రమాలతో పరిపూర్ణుడు. కుతశ్చనూనుడు – ఏ కొద్ది లోపమూ లేనివాడు. ఇంతేగాక, ఆ విశ్వాత్మ అజరుడు – ముసలితనం లేనివాడు. సదా యవ్వనుడు. అతని స్వరూపాన్ని, గుణకర్మ స్వభావాలను చక్కగా తెలిసికొన్న విద్వాంసుడే (యోగియే) కష్టాలకు, మృత్యువుకు ఏమాత్రం భయపడకుండా ఉండగలడు.

That universal soul (Vishwatma) is without desire of any worldly attainments, firm, immortal, self existent, contented with His own blessedness and He is backing nothing, but completely perfect.

The man who knows this universal soul as firm, undecaying and ever young does not fear death.



# వేదవాక్కులు యథార్థ వాక్కులు

**ఓం అపూర్వేణేషితా వాచస్తా వదన్తి యథాయథమ్ ।**
**వదన్తీర్యత్ర గచ్ఛన్తి తదాహుర్ బ్రాహ్మణం మహత్ ॥**

– అథర్వవేదం 10–8–33

**అపూర్వేణ + ఇషితా వాచః + తా =** అపూర్వుడైన పరమేశ్వరుని ద్వారా ఋషుల హృదయాలలో ప్రకాశింపబడిన ఆ వేదవాక్కులు

**వదన్తి యథాయథమ్ =** స్థూల ప్రపంచ పదార్థాలను, సూక్ష్మ పదార్థాలైన ఇంద్రియ మనోబుద్ధులను, జీవాత్మ పరమాత్మలను ఉన్నది ఉన్నట్లు అతి స్పష్టముగా తెలుపుచున్నవి.

**వదన్తీః + యత్ర గచ్ఛన్తి =** ఈ వేదవాక్కులు ఎవరి దగ్గరకు వెళ్లుచున్నవో – ఎవరు వీటిని శ్రవణ మనన నిధి ధ్యాసనలు చేస్తారో

**తత్ + ఆహుః + బ్రాహ్మణం మహత్ =** అట్టివారు గొప్ప మహిమాన్విత జ్ఞానమును పొందుదురు. వారే సరియైన ధర్మోపదేశకులగుదురు.

The voices that are inspired by the Supreme spirit before whom anything of the world was not describe the things as they are. These voices describe the things as they are. These voices describe the things in their fittest manner go whitherward that is called the Divinity, the revealer of the vedic speeches, by the seers.

## గాయత్రి ఆశ్రమ ట్రస్టు

12-10-586/6, ఆర్య సమాజము,
వారాసిగూడ, సికింద్రాబాద్-500 061.
(ఇందిరానగర్ రోడ్డు - 2)
సెల్ : 9848011073,
9908994084

Bill No.:

Date : ......................................

To : ..........................................

.........................................................

.........................................................

| S.No. | Particulars | copies | Rate | Amount |
|---|---|---|---|---|
| | డా॥ కోడూరి సుబ్బారావు గారి రచనలు | | | |
| 1. | గాయత్రీ విజ్ఞానం | | 100.00 | |
| 2. | వేదార్థ విజ్ఞానం | | 100.00 | |
| 3. | వేదాలలో సూర్యకిరణ చికిత్స | | 80.00 | |
| 4. | వేదాలలో సార్వజనిక నియమములు | | 80.00 | |
| 5. | మన ఇతిహాసం | | 70.00 | |
| 6. | మన వేదశాస్త్రాల పరిచయం | | 70.00 | |
| 7. | అగ్నిహోత్రం 100 శాతం వైజ్ఞానికం | | 60.00 | |
| 8. | వేదాలలో జలచికిత్సా విజ్ఞానం | | 60.00 | |
| 9. | జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ | | 60.00 | |
| 10. | వేదాలలో దేశభక్తి | | 60.00 | |
| 11. | పెండ్లినాటి ప్రమాణాలు | | 50.00 | |
| 12. | గర్భాధాన విజ్ఞానం | | 50.00 | |
| 13. | సంధ్యావందనం-వైజ్ఞానిక సమాలోచన | | 50.00 | |
| 14. | వేదామృతం | | 50.00 | |
| 15. | గణపతి రహస్యము, శివరాత్రి రహస్యము | | 50.00 | |
| 16. | వేదాలలో మనోవిజ్ఞానం | | 50.00 | |
| 17. | వైదిక ధర్మం అంటే? | | 50.00 | |
| 18. | అగ్నిహోత్ర రాసాయనిక విశ్లేషణ | | 40.00 | |
| 19. | గోమాత | | 40.00 | |
| 20. | దౌహృదిని | | 40.00 | |
| 21. | మరణానంతరం జీవుని ప్రయాణం | | 40.00 | |
| 22. | మానవ ధర్మము | | 40.00 | |

| | | | | |
|---|---|---|---|---|
| 23. | పండుగల పరమార్థం | | 40.00 | |
| 24. | వైదిక క్రాంతి పథం | | 40.00 | |
| 25. | ఈశావాస్యమిదం సర్వం | | 35.00 | |
| 26. | గాయత్రీ మహిమ | | 30.00 | |
| 27. | యజ్ఞో వై శ్రేష్ఠతమమ్ కర్మ | | 80.00 | |
| 28. | దేవుడు – జీవుడు – ప్రకృతి | | 30.00 | |
| 29. | వేదాల వెలుగుచూపే ఆర్య సమాజము | | 30.00 | |
| 30. | వైదిక జన్మదిన వేడుక | | 30.00 | |
| 31. | వైదిక గృహప్రవేశ విధి | | 30.00 | |
| 32. | వేదాలలో వర్షేష్టి విజ్ఞానం | | 30.00 | |
| 33. | వేదాలలో అశ్వనీ దేవతలు | | 30.00 | |
| 34. | పురుష సూక్తము | | 30.00 | |
| 35. | వైదిక శాంతి పాఠం (వైజ్ఞానిక వ్యాఖ్య) | | 20.00 | |
| 36. | సృష్టికథ | | 20.00 | |
| 37. | సరస్వతీ సూక్తము | | 20.00 | |
| 38. | విశుద్ధ లక్ష్మీ సూక్తము | | 20.00 | |
| 39. | వైదిక సంస్కృతిలో వానప్రస్థాశ్రమము | | 20.00 | |
| 40. | స్వతంత్ర సముపార్జనలో దయానందుడు | | 20.00 | |
| 41. | గంగాధర శివుడు | | 20.00 | |
| 42. | చతుర్దశ భువనములు | | 20.00 | |
| 43. | యజ్ఞోపవీత వైశిష్ట్యము | | 60.00 | |
| 44. | చతుర్వేద మంత్ర రత్నాలు* | | 120.00 | |
| 45. | విశిష్ట వేద సూక్తములు* | | 150.00 | |
| 46. | వైదిక విజ్ఞానము* | | 60.00 | |
| 47. | వేదాలలో భౌతికశాస్త్ర విజ్ఞానము | | 70.00 | |
| | **ఇతర విద్వాంసుల రచనలు** | | | |
| 1. | మాతా పుత్రికల జ్ఞాన చర్చ | | 60.00 | |
| 2. | వేదాలలో విజ్ఞాన బీజాలు | | 30.00 | |
| 3. | స్వరాజ్య సంగ్రామములో ఆర్య సమాజము | | 20.00 | |
| 4. | మరికొన్ని చిన్న పుస్తకాలు ఒక్కొక్కటి | | 10.00 | |

** పోస్టల్ ఖర్చులు అదనం ** Total